# సుందోపసుందులవధ

అను

## తిలోత్తమ

ఐదంకముల తెలుఁగు నాటకము



గ్రంథకర్త

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు



స్టాకిస్టు

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

వెల రు

# చరిత్రలు - కథలు

| | | |
|---|---|---|
| మహాత్మాగాంధి | 0 | 8 |
| జవహర్‌లాల్ నెహ్రూ | 0 | 8 |
| హిట్లర్ దురంతములు | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ | 0 | 8 |
| చిత్తరంజన్ దాసు | 0 | 8 |
| బాబూ రాజేంద్రప్రసాద్ | 0 | 8 |
| అచ్యుతపట్వర్ధన్ | 0 | 8 |
| జాతీయనాయకులు 1 భా | 1 | 4 |
| డిటో 2 భా | 1 | 8 |
| రాజగోపాలాచారి | 0 | 8 |
| జై హింద్ (చక్కని పద్యములు) | 0 | 4 |
| మదనమోహనమాలవ్యా | 0 | 8 |
| రవీంద్రనాథటాగూర్ | 0 | 8 |
| అబుల్ కలామ్ అజాద్ | 0 | 8 |
| జనాబ్ జిన్నా | 0 | 8 |
| నెహ్రూ ఇందిరకు వ్రాసిన లేఖలు | 1 | 0 |
| కస్తూరిబా గాంధీ | 0 | 8 |
| అజాద్ హింద్ ఫౌజ్ | 1 | 0 |
| జైహింద్ వచనం | 0 | 8 |
| స్వామి వివేకానంద | 0 | 12 |
| ఆచార్యకృపలానీ | 0 | 8 |
| భూలాభాయిదేశాయి | 0 | 8 |
| సర్దార్ వల్లభాయి పటేల్ | 0 | 8 |
| బాలనాగమ్మకథ | 0 | 12 |
| విజయలక్ష్మీపండిట్ | 0 | 8 |
| ఖాన్ సోదరులు | 0 | 8 |
| అరుణాఅసఫాలీ | 0 | 8 |
| ఛత్రపతి శివాజీ | 0 | 12 |
| పృథ్వీసింగ్ | 0 | 8 |
| ప్రకాశం | 0 | 8 |
| పట్టాభి | 0 | 8 |
| జయప్రకాశనారాయణ | 0 | 8 |
| సుభాస్ చంద్రబోస్ 200 పే॥ | 1 | 0 |
| పరారీ నేతాజీ | 1 | 0 |
| సాయిబాబా జీవిత చరిత్ర | 0 | 12 |
| రామకృష్ణ పరమహంస | 0 | 12 |
| శ్రీనాథకవిచరిత్ర | 0 | 12 |
| వేములవాడ భీమకవి | 0 | 8 |
| తెనాలిరామకృష్ణ | 1 | 0 |
| బమ్మెరపోతరాజు | 0 | 8 |
| శ్రీకృష్ణదేవరాయలు | 0 | 8 |
| నారదుని కథలు | 1 | 0 |
| సహస్రశిరచ్ఛేద అపూర్వ చింతామణి | 3 | 8 |
| నలమహారాజుకథ—వచనం | 0 | 12 |
| పంచపాండవుల అజ్ఞాతవాసం పెద్దది బైండు | 1 | 8 |
| భోజకాళిదాసు కథలు | 0 | 12 |
| కాశీరామేశ్వర మజిలీకథలు | 2 | 0 |
| పెద్దబొబ్బిలిరాజుకథ | 0 | 12 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# తిలోత్తమ

ఐదంకముల తెలుఁగు నాటకము



బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారిచే
రచియింపఁబడినది.



పబ్లిషర్సు
మోడరన్ పబ్లిషింగు హౌస్
రాజమండ్రి

 [ వెల రు 3_00

# పీఠిక

తిలోత్తమ యను నీ నాటకమున కితివృత్తము మహాభారత మందలి యాదిపర్వములో నున్నది. ఈ కథం దీసుకొని నాటకముగా రచియింపవలె నని పది యేండ్లక్రిందట సంకల్పించి మూ డంకములు మాత్రము వ్రాసియుంచితిని. మఱికొన్ని సంవత్సరములకు నాల్గవ యంకము వ్రాసియుంచితిని. చిట్టచివరకు నయిదవయంకము 1939 వ సంవత్సరమున నక్టోబరు నెలలో ముగించితిని.

శ్రవ్యప్రబంధములలోని విషయములకంటె దృశ్యప్రబంధముల లోని విషయములు శ్రోతలయొక్కయు ప్రేక్షకులయొక్కయు మనంబులమీద స్థిరముగా లగ్నంబులగును. కావ్యముయొక్క యుద్దేశము కేవలము నీతిప్రబోధమే కాకపోయినను, దృశ్యప్రబంధములలో నేదో యొక యుత్కృష్టనీతి వర్ణింపంబడవలయు నని మొదటినుండియు నా యాశయము. ఈ యాశయము ననుసరించి యీ కథను గ్రహించితిని. మహాపరాక్రమవంతులు, పరస్పరప్రేమానుబంధులు నయిన సుందోపసుందులను రాక్షసులు దేవవేశ్యయైన తిలోత్తమను జూచి వలచి పరవశులయి సహజమైన భ్రాతృప్రేమను విడనాడి, లోకాపవాదములను లక్ష్యముచేయక, మాత్సర్యము పెచ్చుపెరగ దానికై యుద్ధముచేసి యన్యోన్యఘాతములచేత నన్నదమ్ము లిరువురు నొక్కసారి మరణించిరి. కథాచమత్కృతి యటుండగా మహోన్నతమైన యీ నీతిని మన యాంధ్రమహాజనులకు వ్యక్తముచేయుటకే ముఖ్యముగా నీ నాటకము రచియించితి నని నేను మఱియొకసారి నొక్కి చెప్పుచున్నాను. అంతరాయపరంపరచేత గ్రంథరచనమునకుం జాల కాలము పట్టినను దైవానుగ్రహమున నిది నేను సమాప్తి చేయఁగలిగితి నని సంతసించుచున్నాను. దీని గుణాగుణములు నిర్ణయింపం బాఠకమహాశయులే యర్హులు.

రంగస్థలమున దీనిని బ్రయోగింపందలచినవారు వ్రాతమూలముగా ముందుగా నా యనుజ్ఞను బడసి యాడవలెను.

రాజమండ్రి
18—5—1940



ఇట్లు
చిలకమర్తి లక్ష్మీనరసింహము

# ఇందు వచ్చు పాత్రలు



## పురుషులు

మహేంద్రుడు—స్వర్గాధిపతి
బృహస్పతి—దేవగురువు
దేవభూతి—అమరచారుడు
విశ్వకర్మ—దేవశిల్పి
సుందుడు—దానవేంద్రుడు
ఉపసుందుడు—సుందుని సోదరుడు
శంబరుడు—సుందుని మంత్రి
జంబుకుడు—సుందుని విదూషకుడు
శౌనకుడు—ఉపసుందుని వేడుక చెలికాడు
జయకేతుడు—విద్యాధరుడు
కొందఱు దిక్పాలకులు—

## స్త్రీలు

తిలోత్తమ—విశ్వకర్మ నిర్మిత అప్సరస
మంజుఘోష—అప్సరస

☞ 59 వ పేజీ 22 వ పంక్తిలో వజ్రజ్వాల అను పదమునకు, బదులుగా మణిమతి యని చదువుకొనవలెను.



•

శ్రీరస్తు

# తిలోత్తమ



## నాంది

తే. గీ. దృశ్యమానప్రపంచంబు దేనివలన
జననవృద్ధి సంక్షయములు గనుచునుండు
నమృత మద్వయ మవ్యయ మప్రమేయ
మేది, యట్టిబ్రహ్మంబు మి మ్మేలుఁగాత!

[ నాంద్యంతమున ]

సూత్రధారుఁడు:—(సభవంక దిరిగి) నిద్రాభంగమును, ధనవ్యయమును, సరకుసేయక నవనాటక సందర్శన కుతూహలంబున విజయంచేసినపూజ్యులైనసభాసదులారా! నాసమర్పించుపుష్పాంజలి పూర్వక స్వాగతము నందుకొనుఁడు. (అని పూవులుచల్లి) మేమీరాత్రి బ్రహ్మశ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహాభట్ట విరచితమై తిలోత్తమ యను నామాంతరముగల సుందోపసుందోపాఖ్యాన రూపకము నిచ్చటఁ బ్రయోగింపఁ దలంచుచున్నాము. కావున సావధానచిత్తులరై మీరు సందర్శింతురు గాక!

చ. అడుగునఁ జేరి ముత్తియము లబ్ధిని యత్నముచేతఁ గాని క
న్పడ, వల నత్తగుల్లలు గనంబడుఁ బైపయి, నట్టులే కృతిన్
గడు శ్రమచేసి యారసినఁగాని గుణంబు స్ఫురింప, దిట్టె గ
న్పడుఁగద దోష, మట్లగుట బాగుగ మీరు విమర్శచేయరే. 2

మారిష! నీపని ముగిసినపక్షమున నొకసారి యిటు రమ్ము.

పారిపార్శ్వకుఁడు:—[ప్రవేశించి] భావ! ఏల నన్నుఁబిలిచితివి? నన్ను స్మరింపకుండ నీ కేపనియుం గాదు గాఁబోలు!

సూత్ర:—ఔను! సమస్తప్రారంభములయందు నంతరాయముగలిగింప వలదని విఘ్ననాయకునిఁ బ్రార్థించినట్లే నాటకప్రారంభమందు నిన్ను వేఁడుకొనవలయును.

పారిపా:—అట్లయిన నే నేకదంతము, తుండము, బొజ్జయు లేని గణాధిపతిని.

సూత్ర:—తుండము లేకపోవచ్చునుగాని, బొజ్జలో గణపతికి నీవు తీసిపోవు. కుడుములు నుండ్రములు భక్షించుటలో గణాధిపతియే నీకుఁ దీసిపోవును. అదియునుఁగాక విఘ్ననాయకుఁ డేకదంతుఁడు. నీ వనేకదంతుఁడవు. కావున నాతని మించినవాఁడవె.

పారిపా:—భావ! ఒక్క మొగమున్నను నీవు చతురాననుఁడవైనట్లె నేను గణాధిపతినైతిని. అయినను నీమాట వ్యర్థముకాఁగూడదు. నాటకప్రయోగముచేయు కుశీలవగణమునకు నే నధిపతి నగుటచే గణాధిపతిశబ్దము నాకు సార్థకమైనది. పరిహాసమున కేమిగాని నన్నుఁ బిలిచినపని చెప్పుము.

సూత్ర:—మహేంద్ర బృహస్పతి విశ్వకర్మల వేషములు సిద్ధముగ నున్నవా?

పారిపా:—సిద్ధముగ నున్నవి. అదిగో! మహేంద్రుఁడు నిండుకొలువు దీర్చి బృహస్పతితో సంభాషించుచున్నాఁడు.

సూత్ర:—సరే! సంతోషము. ఈసభ నొకసారి ప్రశంసించి వచ్చెద నుండుము.

పారిపా:—మంచిది! నీప్రశంసావాక్యముల నేనుఁగూడ వినియెద.

చ. ఒకసమవర్తి యొక్కగురుఁ డొక్కమహాబలుఁ డొక్కవిత్తనా
యకుఁడొకసౌమ్యుఁడొక్కవిబుధోత్తముఁడుం డెడువేల్పుగొల్వఁదా
నెకసకె మాడుచున్నయది యీసభ, యొక్కఁడొకండె గాక పా
యక యటువంటి ధన్యులు మహాత్ము లనేకులు దీన నుండుటన్. 3

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.



శ్రీరస్తు

# త్రిలోత్తమ

## ప్రథమాంకము

[ అప్పుడు మహేంద్రుఁడు, బృహస్పతి, విశ్వకర్మ, కొందఱు దిక్పాలకులు ప్రవేశించుచున్నారు ]

విశ్వకర్మ:—మహేంద్రా! నన్నిక్కడికి సత్వరముగ రావించునంతటి యనుగ్రహము నాపై దేవరవారి కేల కలుగవలెనో వినఁగోరుచున్నాఁడను.

మహేంద్ర:—ఆచార్యా! మన సంకల్పము విశ్వకర్మ కెఱిఁగింపుఁడు.

బృహస్పతి:—అటుల యగుఁగాక! ఓయీ, విశ్వకర్మా! వినియుందువు గదా చతుర్దశభువనకంటకుఁడగు హిరణ్యకశిపు వంశంబున నికుంభుఁడను దుష్టదానవుఁడు జనించెననియు, నాదుష్టనిశాటునకు నిర్జరకోటుల గోటమీటఁగల పోటుబంటులు సుందోపసుందులను నందనులు జనించిరనియు.

విశ్వ:—వినియుంటిని.

బృహ:—ఆదనుజులు మహాభుజబలసంపన్నులు. అత్యద్భుత విక్రమధురంధరులు. రాక్షసులగుటచే నసాధారణ క్రూరచిత్తులు. ఈనైజగుణంబులకుఁదోడుగా వారు తపోబలముగూడ నార్జింపఁదలఁచి వింధ్యాచలశృంగంబున దారుణతపము జేయుచున్నారు.

విశ్వ:—తపముచే దుస్సాధ్యములగు కార్యములు సుసాధ్యము లగును. మఱియు—

తే. గీ. అగ్నిసంపర్కమునఁ జల్లనైన యుదక
మావిరి యయి యుత్కృష్టకార్యములఁ జేయు
మాడ్కి, సామాన్యుఁడును తపోమహిమచేత
జనులు వెఱగంద నద్భుతశక్తిఁ బడయు. 1

మహేం:—

గీ. అవనిలోపలఁ జిరకాల మడఁగి యుండి
బొగ్గు క్రమముగా వజ్రమై పొలుచునట్లుఁ
జిరతరసమాధినిష్ఠుఁడై చెనఁటియైన
నతిశయప్రభావము గల్గి యడరుచుండు. 2

బృహ:—కొందఱల్పులు తపఃప్రభావమున లోకాతీతమహిమాఢ్యు లగుటచేతనే వీరికిఁగూడ నాసగలిగినది.

విశ్వ:—వారితపము విఘ్నము జేయుటకు మీరు తగు ప్రయత్నములు జేయలేదా?

బృహ:—చేయకేమి! ఏనెలంతుకల ముంగురు లినుపగోఁచులు గట్టిన మహామునుల చిత్తముల బంధించు నినుపసంకెళ్లో— యేలతాంగుల వాఁడిచూపులు చిరబ్రహ్మచర్యదీక్షాపరతంత్రులగు మహర్షుల హృదయంబులు చించుతూపులో— యేగరితల లావణ్యములు విరాగులమని విఱ్ఱవీఁగు పరమహంసలనుసైతము నడుగంట ముంచివేయు సరోవరములో— యేచిగురుఁబోండ్ల కరారవిందమృదుస్పర్శలు పరమతపోనిరూఢులగుమునులకు నియమముల మఱపించి పరవశులఁ జేయు మత్తుమందులో— యేముగ్ధగుమ్మల హాసములకు, విలాసములకు విశ్వామిత్రాది మహర్షులు సైతము దాసానుదాసులై నిశ్చలతపంబుల నేలపాలు జేసిరో— అట్టి రంభను, మేనకను, నూర్వశిని, హరిణిని, ఘృతాచిని, మంజుఘోషను వారితపముల కంతరాయములు గల్పించి రమ్మని పంపితిమి.

విశ్వ:—వారి ప్రయత్నములు సఫలము కాలేదా?

బృహ:—వినుము.

గీ. రంభజతనంబు నిష్ఫలారంభమయ్యె
హరిణి బెదరిచూచుచు నింటి కరుగుదెంచె
మంజుఘోష భాషలుడిగి మరలివచ్చె
నయ్యవస్థఁ జూచి ఘృతాచి యడలిపోయె. 3

మహేం:—విశ్వామిత్రునివంటి దృఢమనస్కునిఁ దనకు బానిసం జేసి కొనిన మేనకయు, మహామహులైన పురూరవశ్చక్రవర్తిని వలపించి తనవిలాసంబు లను నురులలోఁ జిక్కుకొనఁ జేసిన యూర్వశియు, ధననాయకునితనయుఁడైన నలకూబరునిఁ దనకు వశవర్తిగాఁజేసిన రంభయుఁ దమకార్యంబులఁ గృతకృత్యలు గాకపోవుటంజేసి యచ్చరమచ్చెకంటు లాపనిని దీర్పఁజాలరని మేము వారిదెస నిరాశ జెందితిమి.

విశ్వ:—వారిప్రయత్నములు నిరర్థకమగుటకుఁ గారణము లేకపోలేదు. ఆవేశ్యలు వృద్ధులగుటచే—

గీ. వారు నవకంబుచెడిన పుష్పములపోల్కి
పదునుచెడిన కత్తులయట్లు పనికిరారు,
మదనదేవుండు వసియింప మానినట్టి
పాడుదేవాలయంబు లావనజముఖులు. 4

మహేం:—ఇది కొంతవఱకు నిజమె.

విశ్వ:—వారితపస్సులు సిద్ధిపొందినవా?

బృహ:—తమప్రయత్నములు నిష్ఫలములైనవని రంభాదులు మాకెఱింగించిరి. అవ్వలివృత్తాంతముఁ దెలిసికొనిరమ్మని యమరచారులలో నగ్రగణ్యుఁడైన దేవభూతి నంపితిమి. అతఁడును వచ్చుచుండును.

మహేం:—అదె వచ్చుచున్నాఁడు.

[ దేవభూతి ప్రవేశించుచున్నాఁడు ]

దేవభూతి:—మహేంద్రా! జయము జయము.

మహేం:—దేవభూతి! దానవతపోవృక్షములు పుష్పించి క్రమ క్రమముగా ఫలించినవా?

దేవభూ—తన యనుగ్రహరసముబోసి పెంచి ఫలింపఁజేయుటకుఁ బరమేష్ఠి సిద్ధముగానుండఁగా నవి యేలఫలింపకుండును?

బృహ:—వృత్తాంతమంతయు సవిస్తరముగాఁ దెలుపుము.

దేవభూ:—దేవా! అందుకే వచ్చితిని. చిత్తగింపుఁడు! అత్తైలాంగుసనచ్చరలేములు దేవరవారిచే నియుక్తలై వింధ్యాచలకాంతారంబునకుం జని నర్మదానదీతీరంబునఁ దపోనిష్ఠాగరిష్ఠులైన దానవేంద్రులం గని మోడుమ్రాఁకులు చిగురించునట్లు— పాషాణంబులు ద్రవించునట్లు— హరిణంబులు మున్నగు మృగంబులు మేఁతలుమాని చెవులు నిక్కఁబెట్టి యాలించునట్లు— పంచమస్వరంబున గానంబు సేసియు, మంజుమంజీర ఝణంఝణనాదంబులు వీనులకు విందులుసేయునట్లు నృత్యంబులు గావించియు, నమృతరసంబు జిలికెడు పలుకుల సంభాషించియు, మారుని శిలీముఖంబులవంటి కటాక్షవీక్షణంబులం బఱపియు, నానావిధ శృంగారచేష్టలం జేసియు దానవేంద్రుల మనంబులు నించుకేనిఁ జలింపఁజేయఁజాలక సిగ్గునం దలలువంచుకొని వెండియు దేవరవారి సన్నిధికి వచ్చిరిగదా!

మహేం:—అదియంతయు విన్నాము.

బృహ:—తదనంతరవృత్తాంతమే వినఁదగినది.

దేవభూ:—పరమేష్ఠి యెంతకాలమునకుఁ బ్రత్యక్షము గాకపోవుటచే సత్వరము కృతకృత్యులు గాఁ దలంచి యాదనుజనాయకులు—

సీ. మదపుఏనుఁగులట్లు మనసారఁ గొన్నాళ్లు
పర్ణభక్షణ జేసి బ్రతికినారు
ఏకుపంకులయట్లు లిచ్ఛమై గొన్నాళ్లు
తుంపలతోఁ బొట్ట నింపినారు
తిమితిమింగిలములతీరునఁ గొన్నాళ్లు
జలములో వాసంబు సలిపినారు
త్రాఁచుబాములయట్లు తనివొందఁ గొన్నాళ్లు
గాలినే తిని యుండఁ గలిగినారు

ఆ. వె. మండువేసఁగులను మట్టమధ్యాహ్నమం
దైనుచిచ్చులకును నంతరమున
నిలిచి యుగ్రతపము శిలలట్లు కులలట్లు
చెక్కు చెదరకుండఁ జేసినారు. 5

మహేం:—తరువాత తరువాత?

దేవభూ:—దేవా! ఆదారుణతపంబుఁ జూచి వనచరులు భూచరులు ఖేచరులు భయంబును విస్మయంబును డెందంబున మల్లడిగొన హాహాకారంబులు గావించిరి.

బృహ:—అది నిజముగా నతిదారుణమైన తపమే.

విశ్వ:—కష్టమేగదా ఫలమునకు హేతువు.

మహేం:—తరువాత తరువాత?

దేవభూ:—దేవా! తరువాత వారు నిర్వికల్పకసమాధిలో నుండిరి. అత్తఱి—

ఉ. చీమలు తచ్ఛరీరములఁ జేర్చెను బుట్టలు, హారముల్బలెన్
బాములు కంఠసీమలను బ్రాఁకెను, గూఁడులుగట్టె తజ్జటా
స్తోమములన్ విహంగములు, చూపఱు వారిని రాతిబొమ్మలా
యేమని సంశయింపఁ, దప మేర్పడఁజేసిరి తక్కి చేష్టలన్. 6

మహేం:—అవి దేహములుగావు లోహములేమో? ఈ తప మశ్రుత పూర్వము. తరువాత?

దేవభూ:—అప్పటికిని లోకపితామహుఁడు సాక్షాత్కరింపకపోవుటచే వారు తీక్ష్ణధారగల ఖడ్గంబులు చేతఁబూని తమ శిరంబులు ఖండించి యగ్నిహోత్రమున కాహుతిజేయ సంకల్పించి కరవాలంబులు కంఠసీమలం జేర్చుసరికి—

చ. కలకలలాడు నాలుగుమొగంబులతోఁ గరుణారసంబులన్
వ్రాలుకు విశాలనేత్రములతో వినయంబున భక్తియుక్తులై
కొలిచి పిఱుఁదవచ్చు మునికోటులతో నతిశాంతమూర్తితో
జలజభవుండు కట్టెదుట సన్నిధియయ్యె ననుగ్రహంబుతో. 7

మహేం:—ఇఁకఁ జెప్పనేల! అతఁడు కోరినవరము లిచ్చినాఁడన్నమాట.

బృహ:—దేవభూతి! పరమేష్ఠి వరములిచ్చెనా?

దేవభూ:—ఏల యీయకుండును? కోరిన వరములన్నియు నిచ్చెను.

బృహ:—వా రేమివరములఁ గోరిరి?

దేవభూ:—దేవా! చిత్తగింపుఁడు. మొట్టమొదట వారు తమ కమరత్వము ప్రసాదింపుమని యడిగిరి.

మహేం:—భక్తవత్సలుఁడైన పరమేష్ఠి వెంటనే యిచ్చెనుగాఁబోలు!

బృహ:—ఇచ్చుట కేకదా వచ్చినది?

దేవభూ:—దేవా! అట్లుగాదు. అమరత్వముదక్కఁ దక్కిన వరములన్నియు నిచ్చెదనని పరమేష్ఠి పలికెను.

మహేం:—అంతటితో వారు సంతృప్తులైరా?

దేవభూ:—ఎట్టులో వా రొప్పుకొనిరి.

బృహ:—ఇతరవరము లేమడిగిరి?

దేవభూ:—ఇదిగో! విన్నవించుచున్నాఁడను—

గీతమాలిక. కమలనాభునిచేతఁ జక్రంబుచేత
నమ్మహేశ్వరుచేత శూలమ్ముచేత

కుధరవైరిచేతను శతకోటిచేత
జలజనాయకుచేతఁ బాశంబుచేతఁ
గాలదండముచేతను గాలుచేతఁ
బావకునిచేత నితరదిక్పతులచేత
నమరసంతతిచేత గ్రహాళిచేతఁ
దంత్రములచేత సర్వమంత్రములచేతఁ
జావులేకుండ వరమిచ్చి కావుమనుచు
నంజలిఘటించి ఫాలమం దసురవరులు
వేయితెఱఁగుల నుతియించి వేఁడుకొనఁగ
నడిగిన వరంబు లన్నియు నజుఁ డొసంగె. 8

మహేం:—భక్తులుచేసినపొగడ్తలకుఁ బద్మగర్భుఁ డుబ్బెనుగాఁబోలు!

బృహ:—పొగడ్తల కుబ్బనివారు, దూషణములకుఁ గోపింపనివారు నెవ్వరు?

విశ్వ:—ఇవియేనా వరములు? మఱేవయిన నున్నవా?

దేవభూ:—కామరూపముగూడ వా రిమ్మని యడుగ నదియుఁ బ్రసాదింపఁబడెను.

మహేం:—అది లేకుండిన వారియాగడములు పూర్తిగా సాఁగుటెట్లు?

బృహ:—అమరత్వ మియ్యకపోవుట కీడులో మేలు.

మహేం:—పితామహుఁడు చేసినదంతయు మేలే. దేనికిసంతసింతుము?

బృహ:—దేవభూతి! తరువాత నేమిజరిగినది?

దేవభూ:—అనంతరము వారు పరమేష్ఠికి సాష్టాంగదండప్రణామంబులు గావించి, యతఁడు తిరోహితుఁడైనపిదప దానవగణసమేతులై నిజపురంబున కరిగిరి.

మహేం:—ఇప్పుడు వారి సంకల్పమేమో?

దేవభూ:—అది దేవరవారే యూహింపవలయు.

బృహా:—వారు చేయుపని మనకుఁ దెలియకపోలేదు.

మ. దనుజానీకముఁ గూర్చి వేలుపులమీఁదన్ సాఁగి దండెత్తుటో
మునులం జంపుటొ యాగముల్ జెఱుచుటో పూఁబోండ్ల హింసించుటో
మనుజుల్ బెగ్గిలఁ బల్లియల్ పరశురామప్రీతిఁ గావించుటో
పనియైయుండును దానవేంద్రుల కికన్ బ్రహ్మాండముల్ భీతిలన్. 9

మహేం:—ఆహా! నాకలోకమునకు మరల గొప్పదుర్దశ యాసన్నమై యున్నది గాఁబోలును!

సీ. స్వర్వారిజాతముల్ పారిజాతంబులు
నసురభోగ్యంబులై యమరు నింక
నందనంబును హరిచందనంబును గూడ
దనుజనాయకులకు దక్కు నింక
సంతానములు దేవసంతానములతోడ
రక్కసి గములచేఁ జిక్కు నింక
మందారములకును బృందారకులకును
కడలేని యెడబాటు గలుగు నింక

గీ. యమరధానికి నే దూరమగుదు నింక
సురభి వారిచే మిక్కిలి స్రుక్కు నింక
వైజయంత మెంతయుఁ బాడుపడెడు నింక
దైవసమితికిఁ బాటులు దప్ప వింక. 10

విశ్వా:—మహేంద్రా! ఎప్పుడో రాఁదలఁచిన యాపదలను గూర్చి యిప్పుడు విచారించినఁ గార్యమేమి?

బృహా:—పూర్వరాక్షసులు గావించిన దుష్కృత్యములు ననుభవించుటచే నవియన్నియు నిప్పుడుఁగూడ జరుగునని మహేంద్రుఁడు భయపడుచున్నాఁడు. ఈ భయముచేతనే మేము నిన్ను రావించితిమి.

విశ్వ:—ఈవిషయమున నేనేమిచేయఁగలను?

మహేం:—విశ్వకర్మా! నీ వనల్పవస్తుకల్పనాచాతుర్యము గల మహా శిల్పివి. అఘటన ఘటనా సమర్థుఁడవు. అసాధారణ ప్రతిభా శాలివి. కావున, దనుజదానవ రాక్షసప్రవరులకు దుర్భేద్యమై దుర్గమమైన నూతనపురంబు నొక్కదానిని నీవు నిర్మించి నాకొసంగుము. దురాచారులు వేల్పువీటిపై దాడివెట్టినప్పుడు పుత్త్రమిత్రకళత్రసమేతముగా, పరివారసమేతముగా నేనాపురం బునఁ దలదాఁచుకొని శుభదినములు వచ్చువఱకు నందుండ వచ్చును. ఈ కార్యము నీకుఁదక్క నితరులకు సాధ్యముగాదు. ఇత్యాది దేవహితము, సకలలోక కల్యాణకరము నగుటచే నీమనీషావిశేష మంతయు వినియోగించి యచిరకాలంబువన దాని నిర్మింపవలయునని వేఁడుచున్నాఁడను.

బృహ:—ఇది మహేంద్రునికోరికయే గాదు; సర్వదైవతమనోరథమని నీవు గ్రహింపుము.

విశ్వ:—మహేంద్ర బృహస్పతులారా! నావంటి యల్పుని మీ రింత పెద్దజేసి ప్రార్థింపవలయునా? ఇట్లు చేయవలసినదని మహేం ద్రుఁడు నన్నాజ్ఞాపించినచో నాచేతనైనపని నేను జేయనా? నిర్జరకోటికి— ముఖ్యముగా మహేంద్రునకు నే నేదే నుపకా రము చేసి ధన్యుఁడనగుటకు నవకాశము గలిగెనేని నేను మహా నందభరితుఁడ నగుదును. కాని, యీ విషయమున నా ప్రయ త్నము నిరర్థకమగునని తలంచెద.

మహేం:—ఏల నిరర్థకమగును?

బృహ:—పురనిర్మాణము నీచేతఁ గాదా?

విశ్వ:—చేతఁగాకపోలేదు. కాని, యెట్టిపురము నిర్మించినను రాక్షసులు కామరూపము, పరమేష్ఠిచే వరముగాఁ బడయుటచే వా రనా

యాసముగ దానిం బ్రవేశించి యెమ్ము బాధింతురు. అందుచేత నది నిరర్థకమంటిని.

మహేం:—అట్లయిన నిర్జరులయాశ లడుగంటినవా?

బృహ:—దుర్జయులగు రాక్షసులచే నిర్జరులు దుఃఖము లనుభవింపక తప్పదు.

విశ్వ:—మహేంద్రా! దానవుల విజృంభణ మరికట్టుటకు నా కొక్క యుపాయము తోఁచుచున్నది. ఎప్పటికయిన వారు స్త్రీల వలననే నిర్జింపఁబడవలయునుగాని శస్త్రాస్త్రములచేత నిర్జింపఁబడరు.

మహేం:—ఆతంత్రముఁ బ్రయోగించి కృతకృత్యులము గాలేకపోతిని గదా!

బృహ:—ఆప్రయత్నము చర్వితచర్వణము.

విశ్వ:—రంభ మొదలగు నప్సరఃకాంతల మించిన మించుఁబోఁడి లభియించినపక్షమున దానవులు దానివలపునందగిలి దీపకళిక ఫలమని భ్రమించి దానిపైఁబడినశించుపురుగులమాడ్కి-నశియింతురు.

మహేం:—అట్టి జగదేకసుందరి యెక్కడనున్నది?

బృహ:—భావమునం దుండవలెనుగాని ప్రత్యక్షముగ నుండు టరిది.

విశ్వ:—బ్రహ్మదేవుని సృష్టిలో నట్టి కాంతాలలామ లేదు.

బృహ:—పూర్వము నారాయణమహర్షి తన యనుభావవిశేషమున నూర్వశినిసృష్టించినట్లు మహానుభావుఁడెవఁడైన నొకయపూర్వ కాంతను సృష్టింపవలయు.

మహేం:—మిత్రమా! విశ్వకర్మ! అనన్యవస్తునిర్మాణ నైపుణీ ధురంధరుఁడవైన నీవె యిట్టిమహోత్కృష్టకార్యమునకుఁ గడంగి కృతకృత్యుఁడవు గావచ్చునని నేఁ దలంచెద.

విశ్వ:—నిర్జరాచార్యుని యాశీఃప్రభావంబునను మీ యనుగ్రహ విశేషంబునను నా కట్టిప్రజ్ఞ యించుక గలదు. నే నిట్టిసృష్టి చేయఁ

గలనో లేనో యని శంకించి నా ప్రతిభావిశేషమును నేన పరీ
క్షించుకొనవలయునని యొక కాంతారత్నమును సృజియించితిని.
తిలోత్తమ యని యామెకు నామకరణము జేసితిని. ఆమెయు
నావెంట నిక్కడికివచ్చినది గాని, తిరస్కరణీవిద్యాప్రభావమున
నెవ్వరికిఁ గనఁబడకుండఁ జేసితిని.

మహేం:—(ఆశ్చర్యముతో) ఏమీ! ఇదివఱకే సృజించితివా?

బృహ:—అది నిస్సంశయముగా మనమనోరథసిద్ధి చేయఁగలదని నమ్మెద.

మహేం:—లోకోత్తర లావణ్యసమేతయైన తిలోత్తమను గనుఁగొన
నాచిత్తము తత్తఱపడుచున్నది. కావున, సత్వరము తిరస్కరణిం
దొలఁగింపుము.

విశ్వ:—అట్లె చేయుచున్నాఁడ. అదిగో! తిలోత్తమ మీయెదుట
నిలిచియున్నది.

[ అప్పుడు తిలోత్తమ ప్రవేశించుచున్నది ]

తిలోత్తమ:—జయము. జయము. త్రిలోకాధినాథా! ఆచార్యా,
అభివాదము చేయుచున్నదానను.

మహేం:—(ఆశ్చర్యముతోఁ జూచి) మిత్రమా! విశ్వకర్మ! ధన్యోస్మి.
ధన్యోస్మి.

తే. గీ. శ్లాఘనీయంబు నీమనీషావిశేష,
మఖిలలోక సమ్మోహన మతివమూర్తి,
దేవకార్య సంసిద్ధి యీతెఱవరూపుఁ
దాల్చి నేత్రపర్వముగఁ బ్రత్యక్షమయ్యె. 11

బృహ:—విశ్వకర్మా! పరమేష్ఠికి శక్యముగానిపని నీవు చేసితివి. చతు
ర్ముఖుఁడు నిన్నుఁజూచి సిగ్గుపడవలసినదె. చూడుము!

క. చపలాక్షితోడ సరిగా
నుపమింపఁగఁ దగినవస్తు వుండమి భువిలో

నుపమానంబును దానికి
నుపమేయంబు నిదె యంచు నూహింతు మదిన్. 12

విశ్వ:—దేవా! ఇది ఘుణాక్షరన్యాయమున వచ్చిన ప్రశస్తిగాని నా ప్రతిభావిశేషమున వచ్చినదిగాదు. లోకపితామహుండైన పరమేష్ఠియుండగ నేనిలుచుటకైనఁ దగుదునా?

మహేం:—నిన్ను మేము తగినట్లు స్తోత్రముచేయఁజాలము. ఈసుందరి వలన మా కార్యసిద్ధి యగును.

బృహ:—నీవు నిర్జరకోటి కృతజ్ఞతకుఁ బాత్రమవు.

విశ్వ:—అయ్యా! ముందుగా స్తోత్రము చేయఁదగదు. కార్యసిద్ధియైన పిదపఁ బొగడవలసినఁ బొగడవచ్చును.

బృహ:—మా కార్యసిద్ధి యైనదనే భావింతును. ఏలయన దీని చక్కఁదనము రక్కసులను భ్రమింపఁజేయఁదగినది.

సీ. తొడలబెడఁగున రంభను ద్రోసివేయు
వాలుచూపుల హరిణిని బేలుపుచ్చు
మంజుఘోషను గెల్చును మాటతీఁపి
దీనిగుణములు వర్ణనాతీతము లహా! 13

విశ్వ:—ఈమెకు మనము కర్తవ్య ముపదేశింపఁదగును.

మహేం:—అవశ్య మట్లె చేయుదము.

విశ్వ:—తిలోత్తమ! నీవు సర్వదేవతాప్రీతికరమైన కార్య మొకటి చేయవలయు. అందు నీవు కృతకృత్య వగుదువేని సకలలోక కల్యాణమగును.

తిలో:—తండ్రీ! శక్యమైన కార్యము నేఁ దప్పక చేసెద.

మహేం:—కళ్యాణి! అది నీకు సాధ్యమైన కార్యమె. సావధానవై వినుము. సుందోపసుందు లను రాక్షసులు మహోగ్రతపంబు జేసి పరమేష్ఠిని మెప్పించి మేటివరంబులం బడసిరి. వారు

నాకమునకే గాక మర్త్యపాతాళలోకములకుఁ గూడ మహోప
కారముఁ జేయుదురు.

తిలో:—ఆవిషయము మీప్రసంగమువలన నిదివఱకే వినియుంటిని.

మహేం:—నీ వా దానవులిద్దఱికడకరిగి నీయగణ్య తారుణ్య లావణ్య
ములఁ జూపి వారిని వలపించి మతిభ్రమము గలిగించి వారి
కన్యోన్యవైరంబు గల్పించి వారి నీయుద్యమమునుండి మరల్ప
వలయు.

తిలో:—మహాప్రభు! రంభాదులైన దేవవేశ్యాంగనలకు సాధ్యముగాని
యీపని నాకు శక్యమగునా?

బృహ:—వారు యౌవనమంతయుఁ జెల్లిపోయిన ముసలివేశ్యలు. నీవు
మిసమిస లాడుచున్న నిండుజవ్వనివి. కావున, నీవు వారింబడఁ
ద్రోసి నీవలలో వైచికొనఁగలవు.

తిలో:—నాయందలి యనుగ్రహముచే మీరు నన్ను మిక్కిలి పొగడు
చున్నారు. కాని, నాకడ నట్టిప్రజ్ఞ యున్నదని నేను దలంపను.
వృద్ధవేశ్యలు తమ యనుభవముచేతఁ బలుమాయలు పన్ని
పెక్కు హావభావములు చేసి వాక్చాతుర్యముచేత నెట్టివానినైనఁ
బడఁద్రోయఁగలరు. నేనో యనుభవములేనిదానను. ఆరితేరిన
దానను గాను.

మహేం:—ఓసీ! ముద్దులమూటలైనమాటలచేత మమ్ము బేలుపుచ్చఁ
దలంచితివా. చక్కఁదనంబు గర్వమున నీవు చతురోక్తుల నాడు
చున్నావు. చూడు! ఇంక దైత్యసంహారమునకు నాగరథాశ్వ
సన్నాహసమేతమైన యుద్ధముతోఁ బనిలేదు. ఆయుధముల
మాట దలఁపనక్కఱయే లేదు. ఏలయన?

సీ. సమ్మోహనాస్త్రంబు చందంబునను నీదు
రూపముండఁగ వేఱె చాపమేల?

హృదయంబుభేదింప నెనలేని క్రొవ్వాఁడి
చూపులుండఁగ వాఁడితూపు లేల?
యెలవెన్నెలలువోలెఁ గులలేని మందహా
సములుండఁ జంద్రహాసము లిఁకేల?
తేనియల్ చిలికెడు తియ్యని జిలిబిలి
పలుకులుండఁగ వేత్ర ములుకు లేల?
గీ. కామరథ రథాంగమువోలె ఘననితంబ
చక్రముండఁగ మఱి యన్యచక్ర మేల?
యసురనిధనసాధనములౌ నాయుధంబు
లన్ని నీకడనున్నవో యంబుజాక్షి. 14

బృహ:—మహేంద్రా! నిజము. విశ్వకర్మ సృష్టించి యిచ్చిన నాగీ రూపకమైన యీయాయుధవిశేషముచేత నీవు—

గీ. చేతఁ గులిశంబు దాల్పక, చెక్కు చెదర
కుండ, మేనఁ జెమ్మట గ్రమ్మకుండ, మెడను
వెలయు మందారమాలిక నలఁగకుండ,
నసురనాథుల గెల్చెద వశ్రమమున. 15

తిలో:—దేవరవారియాజ్ఞాబలము నాచేత నేదైనఁ గొంతపనిచేయింపఁ గలుగును గాని సహజముగ నాయందట్టి సామర్థ్య మేమియు లేదు. భగవానుఁడు కామదేవుఁడుఁగూడ నాప్రయత్నమునకు సాయపడునేని, కార్యసిద్ధి యచిరకాలంబునఁ గాఁగలదు.

విశ్వ:—ఇది కామదేవుని కిష్టమైనపనియే గదా?

మహేం:—నాకూరిమిచెలికాఁడైన మదనదేవుఁడు బృందారకబృంద క్షేమంకరమైన యీకార్యమునందుఁ దోడుపడఁడా?

బృహ:—తోడుపడక యతఁ డూరకుండఁగలఁడా? భాస్కరుఁ డెండ కాయకుండఁగలఁడేని, నిశాకరుఁడు వెన్నెల ప్రసరింపకుండఁ

గలఁడేని, వాయువు వీవకుండఁగలఁడేని, మన్మథుఁడు పూవుటమ్ములఁ జిమ్మకుండఁగలఁడు.

మహేం:—ఈకార్యమువలన నాతని కేమియు శ్రమము లేదు. ఏలయన—

తే. గీ. పొలఁతికన్నుల నమ్ములపోదులు జేసి
వెడఁదకనుబొమల్ సింగాణి విండ్లు జేసి
యేయవచ్చు రక్కసులను, దీయ విల్లుఁ
బూవుటమ్ములు తనయింట మూలవైచి. 16

బృహ:—ఔను! తిలోత్తమయే మన్మథుని యాయుధపేటిక.

విశ్వ:—తిలోత్తమ! మహేంద్ర దేవ గురువులు నన్నొక పెద్దజేసి, నావలనఁ బ్రయోజనంబు గలదని కోరినందుకు, నేను నిర్మించి నందుకు నీప్రతిభావిశేషము సర్వముఁ జూపి, దనుజనాయకుల నిధనం బాపాదింపవలయు.

మహేం:—తప్పక యట్లె యగుఁగాక!

తిలో:—త్రిలోకాధినాథా! చిత్తగింపుము.

శా. దేవా! నీదయయున్న పక్షమున దైతేయేంద్రసంహారముల్
గావింతుంజుమి, మైదునాళ్లగడువుల్ నాకిమ్ము, సంతోష పా
రావారంబునఁ దేలియాడ నమరవ్రాతంబు, వేగన్నులన్
నీ వానందభవాశ్రుల న్విడచి నన్బ్రీతి న్వాలోకింపఁగన్. 17

బృహ:—తథాస్తు. తథాస్తు.

మహేం:—కల్యాణీ! నీ వీ పనిమీఁద సత్వరముగఁ బొమ్ము. నీకుం జెలిమికత్తెగా మంజుఘోషం దీసికొనిపొమ్ము.

విశ్వ:—ఔను! ఈ కార్యమున సాయము జేయుటకు మఱియొక పడంతి యుండవలయును.

తిలో:—చిత్తము దేవా! అట్లు చేసెద.

మహేం:—నీపయనము సుఖావహముగా నుండుఁగాక!

బృహ:—కల్యాణీ! ఇంక నాలస్యమెంచకుము. పొమ్ము.

మ. కలుగుంగావుత నీకు మంగళ, మమోఘశ్రేయముల్ గూర్చు ది
వ్యులయాశీస్సులు బ్రోచునిన్ననిశము, న్భూవిభోడి పూవిల్తుఁడున్
మెలఁగుఁ నీకనుసన్న నీయశమున్ విశ్వంబునం దెల్లెడన్
వెలయున్ జారణ యక్షకిన్నర వధూ విద్యాధరీ గేయమై. 18

తిలో:—నిర్జరాచార్యుని యాశీర్వాదము కామితార్థ సిద్ధిప్రదముగదా!

బృహ:—నిర్జరేంద్రా! ఈ కార్యానంతరమునఁ దిలోత్తమ నీయాస్థాన వేశ్యలలో నగ్రగణ్యగా నుండవలయు.

మహేం:—అందుకు సందియమేమి? రంభాదులకంటె నధిక గౌరవము నకుఁ బాత్రమగుఁగాక!

తిలో:—మహాప్రసాదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇ ది

ప్రథమాంకము.

# త్రిలోత్తమ

## ద్వితీయాంకము

[ సుందుఁడు, ఉపసుందుఁడు, మంత్రియైన శంబరుఁడు ప్రవేశించుచున్నారు ]

శంబర:—(సుందునిఁ జూచి) మహారాజా! భ్రాతృసమేతులై దేవర వారు వింధ్యాచలశృంగమున సకల జగజ్జేగీయమానముగ మహోగ్రతపంబు గావించి పరమేష్ఠిని మెప్పించి యనన్య సాధ్యములగు వరములం బడసి దేవ దానవ మానవ దుర్నిరీక్ష్య తేజోబల దర్పితులై మనంబులకుఁ గన్నులకు నపూర్వపర్వముఁ జేయుచుండుటఁజేసి మేముందఱముఁ గడుంగడు ధన్యులము. మీపూర్వులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపుల తరువాత నింతటి యుగ్రతపంబుజేసి, యిన్ని మహావరములఁ బడసినవారు మన దానవకులములో నెవ్వరు లేరు. అణఁగిపోయిన దానవుల యదృష్టములు మరల మూర్తులుదాల్చినట్లు మీయిరువురు వెలయుచున్నారు. దానవకల్పవృక్షములగు మీయన్నదమ్ముల భుజశాఖాచ్ఛాయలంజేరి దనుజులు చల్లగ సుఖించు మేలు దినములు వచ్చినవి.

సుందుఁడు:—శంబరా! తపస్సమాప్తియు దుర్లభవరప్రాప్తియు నైనది గావున నింక మన కర్తవ్యమేమో తెలియఁగోరుచున్నాఁడను.

ఉపసుంద:—అన్నయ్యా, కర్తవ్య ముపదేశింపనేల? తత్ఫలము సంపూర్ణముగా ననుభవించుటయె.

సుందుఁడు:—

తే. గీ. దానవేంద్ర తేజంబు నిద్రాణ మగుట
నకట! తేజోదరిద్రాణ మైనయట్టి
విశ్వ మస్మత్ప్రతాపాగ్ని వెలయునట్లు
దండయాత్రలు సలుపంగఁదగును మనకు. 1

ఉపసుంద:—అన్నయ్యా! అదియే నా సంపూర్ణమైన మనోరథము. నాభుజములు దేవమర్దనమునకై తత్తఱపడుచున్నవి.

శంబర:—శూరాగ్రేసరులారా! మీ ప్రతాపమునకు మీ బాహుబలమునకుఁ దగిన తెఱంగునఁ బలికితిరి. దనుజ దానవ రాక్షస శ్రవణ భూషణంబు లైన యీ భాషణంబులచే మామనస్సులు నిరుపమానందభరితము లైనవి. అమృతరసమును వర్షించుచున్న యిట్టి పలుకులు మీనోటనుండి యెప్పుడు వెడలునా, పాడు దేవతలచే నడఁచివేయఁబడిన దానవు లెప్పుడు మరలఁ దల యెత్తుదురా, స్వర్గలోక మెప్పుడు ముట్టడించి యాక్రమింతురా యని నామనంబు మేలుకాలము నిరీక్షించుచున్నది. ఇఁక మేము ధన్యులమైతిమి. సమరసన్నాహంబు సేయుమని దండనాథుల కాజ్ఞాపింతునా?

సుందు:—శంబర! మన మెవ్వరెవ్వరిం జయింపవలయును? ముందుగా మన మెవ్వరిమీఁద దాడివెడలవలయు?

ఉపసుం:—అన్నయ్యా! మీరువా రననేల? దివ్యుల నందఱ జయింపవలయును. ముందుగా రాక్షసకుల ద్వేషియైన దేవేంద్రుని, వాని యనుచరు లైన దిక్పతులను నిర్జించి, యమరావతినుండి పాఱఁద్రోలవలయును. తక్కినవారిమాట పిమ్మటఁ జూచుకొందము.

శంబర:—దేవా! ఇంద్రుఁ డొక్కఁడే రాక్షసకులద్వేషిగాఁడు. నారా యణుఁడును ఫాలలోచనుఁడును మొదలగువా రందఱుఁ గూడ మనపట్ల నట్టివారె. కావున నందఱు జయింపఁదగినవారె.

ఉపసుంద:—శంబరా! నీపలుకులు నిజము. అట్లయిన దానవ చమూ సమూహంబులఁ గూర్చుకొనిపోయి—

సీ. నడిసముద్రంబున నారాయణునిఁ ద్రోసి
వల్లకాటికిఁ బంపి వామదేవు
బలవర్ధనుని బాహుబలమర్దనము జేసి
యగ్నిదేవునిశిఖ లంటఁ గోసి
దండపాణిఁబట్టి తగినట్లు దండించి
మూర్ఖుని నిరుతిని మూలనొక్కి
పాశబద్ధునిఁజేసి వరుణు నబ్ధిని ముంచి
యేడ్తెఱ వాయువు నెగురఁగొట్టి

గీ. ధనదు నిక్షేపముల నెల్లఁ ద్రవ్వి దోఁచి
భూతనాయకులకుఁ జిప్ప చేతికిచ్చి
యసురరాజ్య సంస్థాపన మాచరించి
యెల్లభువనముల్ స్థిరముగా నేలవలయు. 2

శంబర:—అయ్యా! మీ రెల్లవిధముల శ్లాఘాపాత్రముగఁ బ్రసంగించిరి. బ్రహ్మదేవునిఁగూడ గెలువవలయు ననుమాట మీనోట రాక పోవుటకుఁ గల కారణమేమి?

సుందు:—(నవ్వి) పితామహునిఁగూడ జయింపవలసినదేనా?

ఉపసుం:—జగత్పితామహుఁడైన పరమేష్ఠి మాతపంబు మెచ్చి యను గ్రహంబు పెంపున వరంబులనిచ్చెఁ గావున వానిజోలికిం బోవుట యధర్మమని నేఁదలంచెద.

శంబర:—ఈ మెత్తదనమే మొదటినుండియు మనకొంపఁదీయుచున్నది.

పితామహుఁడు వరంబులిచ్చినందుకు మీ రాయనయెడఁ గృతజ్ఞులు గావలయునా? పితామహుఁడు చేసినతప్పులు మీమనంబునకుం బొడకట్టుట లేదుగా? నామనంబున నవియెల్ల ముద్రితములై యున్నవి. మీరు నిరాహారులై గాలిమేపరులై జలాశనులై ధూమభక్షకులై యూర్ధ్వబాహులై యేకపాదులై పంచాగ్నిమధ్యంబున—మహోగ్రగ్రీష్మాతపంబున—వానకాలంబునఁ జలికాలంబున నానాబాధలంబడి మేనులు కృశింపఁజేసి జీవచ్ఛవంబులై ప్రాణావశిష్టులై యున్నప్పుడుగదా మీకతఁడు సాక్షాత్కరించి వరంబులిచ్చినది? మిమ్మింత కష్టపెట్టినందుకు నిఁకముందైన దానవుల నెవ్వరిని బాధింపక వెంటనే వరములిచ్చెదవుగదా, యిచ్చెదవుగదా, యిచ్చెదవుగదా యని యడిగి యిచ్చెద నిచ్చెద ననిపించి పెళ్లుపెళ్లున ముసలిపం డ్లూడునట్లుఁ జెంపకాయలు కొట్టవలదా?

సుందు:—శంబరా! ఆతాతపై నీకు నమితాగ్రహముగలదే.

ఉపసుం:—ఇతఁడు చెప్పినమాట సరియే కాని—

శంబర:—నేను చెప్పినమాటలు శిలాక్షరములు.

సుందు:—అమాత్యా! కమలాసనుఁడు పురాణపురుషుఁడు. పూర్వకాలమునుండియు మన రాక్షసుల కనేకవరము లిచ్చిన మహాత్ముఁడు. అది యటుండ—

తే. గీ. కష్టపడకుండ ఫలములు గలుగుజెట్టు
లడుగకుండంగఁ బెట్టునే యమ్మయైన
నన్నిపంట లిచ్చునె నేల దున్నకుండఁ
దపము లేకుండ వరములు దక్కఁగలవె? 3

ఉపసుం:—మాయన్న సెలవిచ్చినట్లు పితామహుఁడు వందనీయుఁడు. వారిజోలికిఁ బోవలదు.

శంబర:—శంకరునిజోలికిఁ బోవచ్చునా?

ఉపసుం:—ఆతఁడు తఱుచుగా మనరాక్షసుల కపకారము జేసినవాఁడు కాఁడు.

సుంద:—ఆవిషయమై మన మాలోచింపవలెను.

శంబర:—మహాతపఃక్లేశమున మీా శరీరములతోఁబాటు బుద్ధిగూడ కృశించి యుండవచ్చును. లేకున్నఁ బూర్వచారిత్రమేల జ్ఞప్తి యుండదు?

ఉపసుం:—ఆ పూర్వచరిత్రమేదో కొంత చెప్పుము?

శంబర:—ఆలాగన్నారు బాగున్నది! కృతయుగములో మన పూర్వులలో నగ్రగణ్యులని చెప్పఁదగిన త్రిపురాసురులు శతానందుని మెప్పించి దుర్లభవరంబులు బడసి కృతకృత్యులై దానవ విశ్వకర్మ ప్రభావంబున నాకసంబున మూఁడుపురంబులు గట్టుకొని, యసాధారణ తేజస్సంపన్నులై లోకవంద్యులై యుండఁగా దివ్యు లసూయాగ్రస్తులై వారిని నాశనముజేయుమని మహేశు నడిగిరి.

సుందు:—అప్పుడు మహేశుఁ డేమిచేసెను?

శంబర:—చిత్తగింపుఁడు!

సీ. ధారుణీమండలి దనస్యందనముఁ జేసి
ప్రామినుకగముల గుఱ్ఱములఁ జేసి
రాజీవగర్భుని రథసారథిని జేసి
రవినిశాకరులఁ జక్రములఁ జేసి
బంగారుకొండను సింగాణిఁగా జేసి
నాగేంద్రు వింటికి నారిఁ జేసి
నారాయణునిఁ గ్రూర నారాచమును జేసి
యంబురాశిని నిషంగంబుఁ జేసి

గీ. భస్మపటలంబు గావించి పట్టణముల
సమరముల దానవేంద్రుల సంహరించి
యట పురారాతి యనుపేర ఖ్యాతిగాంచె
నతఁడు మనకిష్టుఁడగుట హాస్యాస్పదంబు. 4

సుంద:—అది వేల్పులందఱుఁ గుట్రచేసి చేసినపని గాని శంకరుఁ డొక్కఁడే సలిపిన యొగ్గు గాదు. అదియునుఁగాక—

ఆ. వె. నిండుమగతనంబు నీలకంఠుని మొగంగ
గాన మాఁడుతనము గలదు కొంత
యట్టివానిమీఁది కరిగి నిర్జించిన
నేమి పౌరుషంబు నేమి కీర్తి? 5

ఉపసుం:—అట్లయిన వానిజోలికి మనము పోవద్దు. ఆఁడువాండ్రను గొట్టుటకా మన ప్రతాపము?

శంబర:—పితామహుఁడు మనకువరప్రదాత. శంకరుఁడు సగమాఁడుది. కావున వారు మనకు వందనీయులు. ఇంక దండయాత్ర యెవరి మీఁద సలుపవలయును? మనకందఱుఁ జుట్టములే!

ఉపసుం:—ఇంక జయింపవలసినవారు లేరా? నిరంతరదానవకులద్వేషి యైన నారాయణుఁడు లేఁడా? వాఁడే కాదా మహేంద్రుని కాశ్రయుఁడు! వాఁడే కాదా వేల్పుల కేడుగడయు?

శా. నాకాధీశ్వరరక్షకుండయిన యానారాయణుం గిట్టి యా
వైకుంఠంబుననుండి పోనడఁచి తద్భద్రాసనంబందు సు
శ్లోకు న్దానవలోకనాయకుని మాసుందుం బ్రతిష్ఠించి య
స్తోకాటోపముతోడ నేలవలయుఁ దోశ్శక్తి ముల్లోకముల్. 6

శంబర:—భళి! ఉపసుందా! భళి! నీ పలుకు లమృతపుసోనలవలె నావీనులం జొచ్చుచున్నవి.

సుంద:—(ఉపసుందునిమీఁదఁ జేయివైచి) తమ్ముఁడా! నీ భ్రాతృ

వాత్సల్యము నిరుపమానముగదా. నారాయణుఁడు మన కనేక విధములఁ గృతాపరాధుఁడు. అందుచేత నవశ్య మతఁడు దండ్యుఁడు.

సీ. పెనుచేఁపమై జొచ్చి వనరాశి సోమకుఁ
గడతేర్చినట్టి మొక్కలుఁడు వాఁడు
అమృతంబు పంచుచో నసురుల వంచించి
యనయంబుచేయు మాయావి వాఁడు
ఎదుటఁ బోరఁగలేక గదిసి హిరణ్యాక్షుఁ
బందియై చంపిన పంద వాఁడు
అనఘాత్ముఁడగు హిరణ్యకశిపు మానవ
సింహమై చీల్చిన చెనఁటి వాఁడు
గీ. కుబ్జుఁడై బలిఁద్రొక్కిన కూళ వాఁడు
మనయెడలఁ గడు మాయలమారివాఁడు
వాఁడు చేయని యపకృతి వసుధఁ గలదె
వానిమీఁది కేగుట నాకుఁ బండువగును. 7

శంబరః—శహబాస్! మహారాజా, శహబాస్! నా కడుపులోనున్న యక్కసు తీరునట్టి కాలము వచ్చినది. ఆ వైకుంఠముఁజొచ్చి నేనేమి చేయించెదనో చిత్తగింపుఁడు. సనక సనందన సనత్కుమార సనత్సుజాత ప్రముఖులైన నిత్యముక్తులకుఁ గలుగుపాట్లు కుక్కలకు నక్కలకు నైనఁ గలుగవు. ఎంతపాపంబు జేసిన జంతువులురా విష్ణుభక్తు లని వారు తలంచి విష్ణు నాశ్రయించి నందులకు మిక్కిలి పశ్చాత్తాపంబు నొందునట్లు జేసెద.

సుందః—(నవ్వుచు) ఏమి చేసెదవు?

శంబరః—చిత్తగింపుఁడు.

సీ. భుజయుగంబులమీఁదఁ బొల్చు చక్రాం
లాంకురాతులతోడ నరుగ

శృంగంబులనుబోలు పంగనామాలను
నాల్కలు తెగచాఁచి నాకివైచి
బొజ్జదాఁకను గళంబుల ముందు వ్రేలాడు
తులసిపూసలపేర్లు త్రుంచివైచి
కందిరీఁగల తుట్టకరణి భీతినిగొల్పు
గడ్డాలు మీసాలు కాల్చివైచి
ఆ. వె. మర్రియూడలట్లు మహినంట వ్రేలెడు
జడలుబట్టి యీడ్చి పుడమిఁ గూల్చి
చిత్రవధలఁజేతు శ్రీవైష్ణవులనెల్ల
నసురకోటి మెచ్చి యౌర యనఁగ. 8

సుందు:—(నవ్వి) నీమనోరథము సంపూర్ణముగ నెఱవేఱును లే.

ఉపసుం:—మనదండయాత్రావృత్తాంతము విన్నతరువాత నిఁక నెవ్వఁడు విష్ణుభక్తుఁడు గా సాహసింపఁడు.

శంబర:—వారి నేమిచేసినను బాపములేదు. విష్ణుభక్తు లందఱు నిఁక మీఁద సుందోపసుందభక్తులు గావలెను

ఉపసుం:—సరే! మనము ముందుగా వైకుంఠముమీఁది కరుగవలయునా? ఇంద్రలోకముమీఁది కరుగవలయునా?

సుందు:—ముందుగా దేవేంద్రుని, దిక్పాలకులను గెలిచి నిన్న మహేంద్రునిఁజేసి యవ్వల వైకుంఠమున కరుగవలయునని నాతలంపు.

శంబర:—ఉపసుందుఁడు దేవేంద్రలోకమును, మీరు వైకుంఠమును నిష్కంటకముగాఁ బరిపాలించి మా కన్నులపండువు సేయవలయును.

ఉపసుం:—స్వర్గము ముందుదాడివెట్టుటయె నాసంకల్పము. ఏలయన?

ఉ. అంతకుమీఁదికన్న సలిలాధిపుమీఁదికినన్న నాశచీ
కాంతునిమీఁదికన్న మది గంతులువేయుచు లోహ మా యయు

సాగరాంతముమీఁదికిం జనినకైవడి ముందుకు నేఁగుచుండు, దే
వాంతకు లన్నదమ్ములను ఖ్యాతి వహింపఁదలంతు నెప్పుడున్. 9

సుందు:—తమ్ముఁడా! అట్లె యగుఁగాక!

ఉపసుం:—అన్నయ్యా, పాతాళలోకముమాట యేమి? మన పతాకములు బలిచక్రవర్తి కోటపై నెగురవలదా?

శంబర:—అది కూడనిపని.

ఉపసుం:—ఎందుచేత?

సుందు:—అతఁడు రాక్షసుఁ డనియా?

శంబర:—ఔను!

మ. మనవాఁ డాబలిచక్రవర్తి యగుట న్మాన్యుండు దైత్యాళికిన్
మన మాభూపతిమీఁది కేఁగుట యధర్మంబంచు నే నెంచెదన్
మనలోన న్మన మైకమత్యమును సంపాదించి వర్తించినన్
మన నింకొక్కఁడు తేఱిచూడఁగలఁడే మాత్సర్యసంయుక్తుఁడై. 10

సుందు:—శంబరా! నీయుపదేశము శ్లాఘాపాత్రము. ఐకమత్యమువంటి దింకొకటి లేదు. చూడు!

మ. చలిచీమల్ గుమిగూడి చంపును మహాసర్పంబులన్, గడ్డిపోఁ
చలు త్రాడౌనటు లల్లిన న్గజములన్ సైతంబు బంధించు, నా
కులు దట్టంబయి సూర్యతాపమును నాగున్, రేణువుల్ పర్వతం
బులగున్, సంద్రములౌనుగా జలకణంబుల్ కూడి తాముండినన్. 11

శంబర:—ఆభావమే నిరంతరముండవలయునని నాకోరిక. ఐకమత్యము కార్యదీక్ష లేకపోవుటచేతనే మన దానవకులములు పలుమాఱు సామ్రాజ్యములఁ గోల్పోయినవి. దనుజ దానవ కులములలో నెవఁడో యొకమహావీరుఁడు చిరకాలమునకు ధూమకేతువువలె జన్మించి జగద్భయంకరుఁడై వర్తించుటయు వానిననుసరించి

మిడుతలదండులట్లు కోటానకోటులు దండిమగలగు రక్కసులు స్వర్గమర్త్య పాతాళంబులకుఁ బోవుటయు నాయోధాగ్రేసరుఁ డే నారాయణుని మాయోపాయంబులనో జిక్కి యస్తమించిన తోడనే మన చలంబులు బలంబులు నస్తమించుటయు ననునదే మన చరిత్రము. బలిచక్రవర్తిని మన మెఱుఁగకపోయినను స్వకులాభిమానముచేత నైకమత్యప్రేరితులై వానిని మీరు విడుచుట దానవకులక్షేమంకరమైన కార్యము. ఇతర దానవ ప్రభువులయెడలనేగాక మీ యన్నదమ్ములు నొండొరులయెడ ద్వేషభావములేక పరమమైత్రిగలిగి యుండవలెనని నా కోరిక. పెద్దవాఁడనగుటను ననేక దానవ రాజ్య సంక్షయములఁ జూచిన వాఁడ నగుటచేతను నిట్లు మనవి సేయుచుంటిని గాని వేఱొక తలంపుచేతఁ గాదు.

సుందు:—(నవ్వి) మాలోమా కైకమత్యముండవలెనని నీవు బోధించు చుంటివా?

గీ. అంగములు రెండుగాని మా కాత్మయొకటి
యతఁడు నాప్రాణ, మాతనిప్రాణ మేను
గతులు దప్పి తిరుగుఁగాక గ్రహచయంబు
మాకు భేదంబు గలుగదు మనసులందు. 12

ఉపసుం:—అది యట్టిద. శంబర!

ఉ. సుందుఁడు చందమామ, యుపసుందుఁడు వెన్నెల చిత్రవైఖరిన్
సుందుఁడుభాస్కరుండు, నుపసుందుఁడు వాయనిఛాయ నమ్మమీ
సుందుఁడు వేడివేలు పుపసుందుఁడు తేజము, నేనెఱుఁగ నీ
సందియ మేల తోఁచినదొ స్వాంతమునందున నీకు శంబరా! 13

శంబర:—దానవేంద్రులారా! ధర్మోపదేశపూర్వకముగా నేనంటినిగాని మీకట్టిభేదము కలుగుననికాదు. కావున నాతప్పు మన్నింపుఁడు.

సుంద:—శంబరా! తప్పులేదు. దానవకుల పురోభివృద్ధి మదినెంచి నీవట్లంటివి. నమ్ముము! మాకెన్నఁడుం బొరపొచ్చెములు గలుగవు. అభిప్రాయభేదములు జనింపవు. పరస్పర ద్వేషములు గలుగవు. మనోమాత్సర్యమున కవకాశమే లేదు. అతనిఁ బాసి నేను క్షణముండలే ననియు నన్నుఁ బాసి వాఁడు నిమిషమేని నిలువఁజాలఁడనియు నీవెఱుఁగుదువు గదా!

శంబర:—దేవా! ఎఱుఁగుదును. అది నా కనుభవసిద్ధమె.

సుంద:—అందుచేతనే మాకన్యోన్యవియోగదుఃఖము సంభవింపకుండ మేమిద్దఱ మేకకాలమందె మరణమొందినఁ గడుమెన్న యని నా కప్పుడప్పుడు దోఁచుచుండును.

ఉపసుం:—నాకు నదియె కోరిక.

శంబర:—(చెవులు మూసికొని) కటకట! అమంగళము ప్రతిహత మగుఁగాక! అమంగళము ప్రతిహత మగుఁగాక!

సుంద:—శంబరా! నాపలుకులు నీకంత శ్రవఃకఠోరములుగానున్నవా?

శంబర:—శ్రవఃకఠోరములు మనఃకఠోరములు గూడ.

సుంద:—మరణ మెప్పటికైన రాకపోదుగదా! వచ్చినప్పుడే యట్టి చావు కావలెనని కోరుచుంటిమి.

ఉపసుం:—"జాతస్య మరణం ధ్రువ" మ్మనుమాట వినలేదా?

శంబర:—వేదాంతము క్షణకాలము విడిచిపెట్టుఁడు. చతుర్దశ భువన విజయ మంగళ సూచకంబు లగు వాచకంబులు జరుగునప్పుడమంగళము తలపెట్టఁగూడదు. సర్వదా మీకు మంగళమగుఁగాక! మన సంకల్పము ననుసరించి దండయాత్రలు విజయప్రదము లగునేని—

తే. గీ. దానవేంద్ర! మీగృహము నింద్రాణిచేతఁ
జిమ్మఁ జేయింతుఁ జీపురు చేతికిచ్చి,

వంటలక్కలఁ జేతు దిక్పతులసతుల
నీళ్లు మోయింతు సిరిచేత నీగృహమున. 14

సుందు:—శంబరా! కార్యము పూనకుండ ముందే సిద్ధి నపేక్షింపకుము. నీవుపోయి నాకలోకదండయాత్ర పురంబునఁ జాటఁ బంపుము. దండనాయకులు సైనికులు నాయుధపాణులై జైత్రయాత్రకు సిద్ధముగ నుండునని యాజ్ఞాపింపుము.

శంబర:—మహాప్రసాదము స్వామీ! మహాప్రసాదము దేవా!

ఓహో! దనుజదానవవంశప్రభూతులగు మహాయోధులారా! దానవలోకచక్రవర్తులు మహాతేజస్స్ఫూర్తులు నైన సుందోపసుందులు నాకలోక దండయాత్రాపరాయణులై యున్నవారు. మీరందఱు సాయుధులై కవచ శిరస్త్రాణాదుల ధరించి వెంట రండు. ఇందువలన మీ కమితలాభంబులు గలుగును.

గీ. దోఁచుకొనవచ్చు నాకంబు తోఁచినట్లు
దేవతలఁ గొట్టవచ్చును దిట్టవచ్చు
స్త్రీలఁ జెఱబట్టవచ్చును జెఱుపవచ్చు
దండయాత్రకు రండోయి దైత్యులార! 15

మఱియును మేరుపర్వతము మన యింటిముందఱి పేడకుప్పవలె మన యధీన మగును. మనకుఁ గావలసినంత బంగారము కావలసినన్ని నగలు నాణెములు మీ మీ భార్యలకు సువర్ణకంఠాభరణములే గాక కుక్కలకు బంగారపు గొలుసులు పశువులకు బంగారపుఁ బలుపులు మఱియు నింకను—

శా. ముంత ల్గూనలు బానలు న్బిడతలు న్మూఁకుళ్లుఁ బెన్దాకలున్
జింతం బొందక బాఱవేయుఁడి యిఁక న్మీభాగ్యముల్ పండెడిన్
పంతం బేర్పడఁ ద్రవ్వి మేరునగమున్ బంగారపుం దాఁకలున్
ముంతల్ లోనుగఁ జేసికొందము మహామోదంబుతో వస్తువుల్. 16

కావున మీరలు బంగారుకొండ త్రవ్వుకొనుటకు, పాఱలు గునపములు మున్నగు సాధనములు మోసి తెచ్చుకొనుటకు, తట్టలు బుట్టలు మొదలగు భాజనంబులు వెంటఁగొని రావల యును. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సుం:—ఇతఁడు దానవుల యిండ్లుగూడ బంగారపు దూలములతో వాసములతోఁ గట్టింపఁ దలఁచుకొన్నాఁడు.

ఉపసుం:—ఈ వృద్ధజంబుకముయొక్క యాశకు మేర లేకున్నది. శక్య మైనయెడల రోహణాచలము త్రవ్వి రత్నాలపలకలు తెచ్చి గోడలు పెట్టింపవలె నని యతని సంకల్పము.

[అప్పుడు సుందుని విదూషకుఁడగు జంబుకుఁడు ప్రవేశించుచున్నాఁడు]

జంబుకుఁడు:—(తనలో) వహవ్వారె వహవ్వా! ఇఁక నా పెండ్లాముచేత నాకు దెబ్బలు తిట్లు తప్పిపోయిన వన్నమాటె. మొలకు వడ్డాణము లేదు. చేతులకుఁ గంకణాలు లేవు. కాళ్లకు కడియాలు లేవు. చెవులకు గుద్దులు లేవు. చేయింపవలసినదని యనేకవిధ ములఁ బీడించుచున్నది. ఈ దండయాత్రలో మేరుపర్వతము త్రవ్వి కావలసినంత బంగారము దెచ్చి దాని ముందఱఁ బోసె దను. ఇష్టమువచ్చినన్ని నగలు చేయించుకొని తళతళ లాడుచు రంభలాగుండి నామీఁద సంపూర్ణమైన యనుగ్రహము గలిగి యుండును. దుద్దులు చేయించనందు కిఁకమీఁద గుద్దులుండవు. కంకణాలు చేయించనందుకు టెంకణాలు సమర్పింపనక్కఱలేదు. కడియము లియ్యనందుకు నే బిడియపడనక్కఱలేదు. మురుగులు చేయించనందు కిరుగులు పొరుగులు వచ్చి నన్ను తూలనాడరు. నాదినములు బాగుపడినట్లె కనఁబడుచున్నవి. ఆఁడుదానిపో రణఁగునుగనుక ప్రస్తుతకార్యముచూచుకొనవచ్చును. తొలకరి మెఱుపులాగ నీమె యెవ్వరో దారిలోఁ గనఁబడి మహారాజు

గారికి, తనరాక విన్నవింపుమని నన్నుఁగోరినది. ఇది యెవ్వరో తెలియదు. అయినను నాసామ్మేమిపోయినది! ఆమెరాక ప్రభులతో విన్నవించెదను. (ప్రకాశముగా) జయము. జయము. దానవేశ్వరులారా!

సుందు:—ఓహో, జంబుకుఁడా! రా. ఏమివిశేషములు?

ఉపసుం:—వీనిమొగముజూడ నేదో విశేషమున్నట్లే కనఁబడుచున్నది.

జంబు:—విశేషము శేషములేకుండ నశేషము జెప్పెద వినుఁడు! నేను దేవరవారి సన్నిధికి వచ్చుచుండఁగా మార్గమధ్యమున నాకొక యాఁగన కనఁబడినది. అబ్బా! ఆఁడదంటె ఆఁడదిగాదయ్యా అది అది యొప్పులకుప్ప. దానిమేనిమీఁద నున్న నగలుచూచితిమా నిప్పులకుప్ప. చూడఁగా చూడఁగా నాకది భోగముదానివలెఁ గనఁబడుచున్నదండి. ఆ నక్కవినయాలు— ఆ టక్కులు— ఆ చూపులు— ఆ కోపులు— ఆ నీటులు గోటులు చూడఁగా నది సంసారిలాగు కనఁబడలేదు. దానిపేరు తిలోత్తమ యఁట!

సుందు:—ఏదీ! తీసికొనిరాలేదేమి? పేరు తిలోత్తమా?

ఉపసుం:—వెంటనే ప్రవేశపెట్టుము.

జంబు:—అదిగో! ఆగోడచాఁటున నున్నది. సిగ్గుపడుచున్నదిగాఁబోలు! రావమ్మా, భోగముదానికి సిగ్గేమిటి? ప్రభువువారి యెదుట గజ్జెకట్టు.

[ అప్పుడు తిలోత్తమ, మంజుఘోష ప్రవేశించుచున్నారు ]

తిలోత్తమ:—ఓసీ! మంజుఘోషా! ఈ దానవేంద్రులు కాటుకకొండల వలె నల్లనిరంగుగలిగి గంభీరమైన యాకారములతో నున్నారు. వీరి రాతిగుండెలు మనము కరఁగింపఁగలమా?

మంజుఘోష:—తిలోత్తమా! నేనును, రంభా మేనక మొదలగు వారము వీరి మనస్సులు హరింపలేకపోయితిమి. మహా ప్రవా

హము కొండలనైన భేదించునట్లు నీ లావణ్య ప్రవాహము వీరి హృదయములు భేదింపవలెను.

తిలో:—ఏమో! మహేంద్రుఁడు నామీఁద గంపంత యాశబెట్టుకొని యున్నాఁడు. నే నింకఁ గృతకృత్యురాలను కాఁగలనో లేనో. అయిదు దినములలో వీరిని సంహరింతు నని ప్రతిజ్ఞ చేసితిని. అచ్చరలలో నాకు నగుబాటు కాకుండ కామదేవుఁడు నాకు సాయము చేయుఁగాక! భగవానుఁడా, పుష్పబాణ!

గీ. చచ్చియును వేగ సాధింపఁ జాలితీవు
అక్కజంబుగ రుద్రుని యంతవాని
నట్టి నీమగంటిమి ముందు నసురులెంత?
మ్రొక్కులివె యందుకొనుమయ్య చక్కనయ్య. 17

మంజు:—అదే! దానవేంద్రులు మనవంకనే చూచుచున్నారు. పద!

తిలో:—సీ. అష్టదిక్పాలకాహంకార జంబాల
పటలప్రచండ ప్రభాకరులకు
సర్వదైవత భుజాగర్వ కాలాంబుద
వ్రాత విక్షేపప్రభంజనులకు
మహితశాత్రవ శిరో మాల్యాయమాన వి
శంకట తర చండశాసనులకుఁ
జక్రవాళాచల సానుమండల తటీ
విహరమాణ సుయశోవిలసనులకు

గీ. సిద్ధ సాధ్య విద్యాధర శీర్ష మకుట
మణి మరీచి రంజితపాద మండలులకు
నన్నదమ్ముల కసురనాయకుల కివిగొ
వందనంబులు సుందోపసుందులకును. 18

మంజు:—దానవేంద్రులారా! జయము జయము.

తిలో:—గీ. జయము సుంద నీ, కుపసుంద జయము నీకు
మంగళము సుంద, యుపసుంద మంగళంబు
శోభనము సుంద యుపసుంద శోభనంబు
స్వస్తి సుంద నీ కుపసుంద స్వస్తి నీకు. 19

సుందు:—(తనలో) ఈమె యెవ్వతె చెపుమా?
గీ. మేను దాలిచి వచ్చిన మెఱుపుఁదీఁగ
ఉపసుం:—(తనలో) పలుక నేర్చిన జాళువా పసిఁడిబొమ్మ
సుందు:—(తనలో) అంగములు దాల్చివచ్చిన యలరుఁదీవ
ఉపసుం:—(తనలో) చాన యాకృతిఁ గైకొన్న చక్కఁదనము. 20

సుందు:—కళ్యాణీ! నీదర్శనముచేత నే మాకు జయముశుభమునగుఁగాక!
సీ. చింతల నెడు కాఱుచీఁకటుల్ దొలఁగించు
చిన్నినవ్వులకు నాశీస్సు లబల!
ఉపసుం:— కలువరేకులఁ మించి కనువిందు చేసెడు
కన్నుదమ్ములకు మంగళము లతివ!
సుందు:— ముజ్జగంబులవారి మోహాబ్ధిలో ముంచు
లావణ్యమునకుఁ గల్యాణ మతివ!
ఉపసుం:— రాతిగుండెలనైన ప్రక్కలింపఁగ నేర్చు
వన్నెచిన్నెలకు దీవనలు చెలియ!

సుందు:— గీ. అబ్జనాభు జగన్మోహనాకృతివలెఁ
గనులఁ దనియించు నీకు స్వాగతము తెఱవ!
ఉపసుం:— విజయయాత్రకేగెడు మాకు విజయలక్ష్మి
గతిఁ బ్రసన్నయా నీకు స్వాగతము బాల! 21

తిలో:—దానవలోక చక్రవర్తుల యాశీర్వాదములఁ బరిగ్రహించుచున్న దానను.

జంబు:—ఓపిల్లా! నేనుగూడ రెండు తట్టల యాశీర్వచనము లిచ్చు చున్నాను. పరిగ్రహింపుము.

సుందు:—తమ్ముఁడా! ఆ పరమేష్ఠి,

గీ. నిశల ముకుళభావమునొందు నీరజంబు
చేయు చేతితో నీకనుల్ చేయలేఁడు,

ఉపసుం:—అన్నయ్యా!

సరిగ పగలు గన్బడనట్టి చందమామఁ
జేయు చేతితో నీమోముఁ జేయ లేఁడు

తిలో:—దేవా! అతిశయోక్తులతో నిండిన ప్రశంసకు నేను పాత్రము గానుగాని పరమేష్ఠి నాకన్నులను మొగమునే గాదు— నన్నే చేయలేడు.

జంబు:—అట్లయిన నీ వాకాశమునుండి మంచుగడ్డవలె నూడిపడితివా యేమి?

సుందు:—అట్లయిన నీజన్మవృత్తాంత మేమి?

మంజు:—దేవా! విశ్వకర్మ యీమందయానను దన ప్రభావాతిశయమున మనస్సుచే నిర్మించెను.

సుందు:—ఓహో! మనోనిర్మిత మగుటచేతనే యీమె లావణ్య మింత వర్ణనాతీతమై యున్నది.

ఉపసుం:—పరమేష్ఠి కిట్టి నిర్మాణసామర్థ్యము లేదు.

జంబు:—మతిలేని యాబ్రహ్మదేవుఁడు కొఱవిదయ్యములఁ బోలు నా పెండ్లామువంటి మలపముండలను కుమ్మరి కడముంతలు చేసి నట్లు సృష్టింపఁగలఁడు కాఁబోలు!

సుందు:—కల్యాణీ!

గీ. వేల్పుదొర కొల్వు సానివై వెలయునీవు
రక్కసులఁ జూడఁగోరు కారణ మదేమి?

నందనోద్యానవీథుల నడచునీవు
భూతల మలంకరించెను హేతు వేమి? 23

ఉపసుం:—అసమాన నిజలావణ్య తారుణ్యంబులఁజూపి మధ్యమ లోకమును ధన్యము జేయవలె నని.

జంబు:—భూలోకములో నున్న వారి కొంపలుగూడఁ దీయవలయునని.

తిలో:—దానవ సార్వభౌములారా! నావచ్చినపని చెప్ప నాకే సిగ్గగుచున్నది. చెలి! నీవు చెప్పవే!

మంజు:—రసహీనములైన నాపలుకులతోఁ జెప్పుటకంటె నీవేచెప్పుట మంచిది.

సుంసు:—ద్రాక్షాఫలగుచ్ఛములఁబోలు నీ పలుకులతోడనే మాకు హృదయానందము జేయుము.

ఉపసుం:—మధురవీణాస్వరములవంటి నీపలుకులే మా శ్రవణ భూషణము లగుఁగాక!

జంబు:—బెట్టుసరిచేయక వెంటనే చెప్పు. భోగముదానికి సిగ్గేమిటి?

తిలో:—దేవా! ఆకర్ణింపుఁడు.

తే. గీ. నామదికి నచ్చుపాటగు నాయకుండు
క్షితితలంబున నెందైనఁ జిక్కు నేమొ
యనుచు వెదకంగవచ్చితి నసురనాథ!
అంగనకు నుండవలెఁగదా యండ యొకటి. 24

ఉపసుం:—నీవుగూడ నాయకుని వెదకుకొనవలయునా? ముల్లోకముల వారు నిన్నే వెదకుకొందురుగదా!

జంబు:—నేనేమైనఁ బనికివత్తునా?

సుందు:—కల్యాణీ! నీకెట్టినాయకుఁడు కావలెను?

తిలో:—ఎట్టివాఁడని దేవరవారితో మనవిసేయఁగలను?

సీ. ఎదిరిమూఁకలఁ జివ్వఁ జెదరఁజిమ్మునతండు
నీరేడుజగముల నేలునతఁడు

అనఁటిపండులజంట యటు లత్తెడునతండు
కులగౌరవంబులు గలుగునతఁడు
చక్కఁదనంబున స్మరుని బోలునతండు
నిండుజవ్వనమందు నిలుచునతఁడు
పడఁతుల కింపుగాఁ బలుకనేర్చునతండు
విద్దెలప్రోఢయై వెలయునతఁడు
గీ. బహుతపము జేసి వరములఁ బడయునతఁడు
మలినచరితంబు లేకుండ మనునతండు
సిరులతోఁ దులఁదూఁగుచుఁ జెలఁగునతఁడు
ప్రాపకుఁడు గావలయు నాకు రాక్షసేంద్ర! 25

సుందు:—షడ్రసము లొక్క పదార్థమందుఁ జేరన ట్లొక్క పురుషుని యందే యిన్ని గుణములుండు టరుదు ఆఱు రుతువు లేకకాలమున వచ్చెనేని, ఇన్నిగుణము లొకచో నుండును.

జంబు:—నీటిపేరే హిరణ్యాక్షవరములు.

తిలో:—దేవరవా రేమన్నను నట్టిపురుషుఁడు దుర్లభుఁడుకాఁడని నా నమ్మకము.

సుందు:—అట్టివాఁ డెక్కడ సులభుఁడు?

తిలో:—పదునాలుగుభువనము లున్నవి. ఒక్కొక్క భువన మతి విశాలమై యున్నది.

మంజు:—ఎందననేల? ఇందే సులభుఁడు గావచ్చును.

సుందు:—(తనలో) దీని నెచ్చెలి యిందే దొరకవచ్చు ననుచున్నది. ఎవరి నుద్దేశించి యుండును?

ఉపసుం:—(తనలో) ఇది మనస్సులో నన్నుఁ బెట్టుకొనెనా యేమి?

జంబు:—(తనలో) ఇది యెవరినో బుట్టలోఁ బెట్టఁ దలఁచుకొన్నది.

సుందు:—కల్యాణీ! నేనొక్కమా టడుగుచున్నాను. దానికుత్తరము

జెప్పుము? స్వర్గమున సిద్ధ సాధ్య కిన్నర కింపురుష గరుడగంధర్వ విద్యాధర ప్రముఖులు దివ్యు లెందరో యున్నారు. వారిలో నొక్కరేని నీమనస్సునకు నచ్చినవారు లేరా?

తిలో:—ఉన్న పక్షమున నిక్షేపమువంటి స్వర్గమువిడిచి దేశాంతరముల పాలు గానేల?

ఉపసుం:—త్రిలోకాధీశ్వరుండైన మహేంద్రుండు నీవలపునకు గుఱి గాలేదా?

తిలో:—అహహా! మంచిమాట సెలవిచ్చినారు.

సుందు:—ఏమట్లనుచున్నావు! ఇంద్రుని ప్రాపకము నీకు లభించెనేని—

తే. గీ. నందనోద్యానవీథుల నడువవచ్చుఁ
దాల్పవచ్చును మందారదామ మఱుత
పారిజాత తల్పంబులఁ బండవచ్చుఁ
జెలఁగి వైజయంతమున వసింపవచ్చు. 26

ఉపసుం:—అంతేగాదు—

తే. మగువ! మధుకైటభారాతి మఱఁది యగును
శక్రుపట్టంపురాణి నీసవతి యగును
తాల్చుచుంద్రు నీయాన నౌదలలయందు
వేల్పుటువిదలు నెత్తావి విరులఁబోలె. 27

జంబు:—ఎందుకా పాడుస్వర్గము? ఇటువంటి ముదిలంజలేగాని ముంజలు దొరకవు. ఏదో యమృతమందురేగాని ముంతెడు తాటికల్లుగాని, యీఁతకల్లుగాని దొరకదు. నీరుల్లి వెల్లుల్లి లేని లోకము నరకలోకముగాని స్వర్గలోకమగునా? అది విడచుటలో నీమె మంచిపని చేసినది.

తిలో:—దేవా! ఇంద్రుని మేలిగుణములేగాని యవగుణములను మీరెన్నరైరి. అతనికిఁ బరాక్రమమా శూన్యము. పసులకాఁపరి

చేతికోలయైన నుపకరించునుగాని యతనివజ్ర మెందునకుం బనికి రాదు. అహల్యావృత్తాంతమే యతని సచ్చరిత్రమును వేయి నోళ్లఁ జాటుచున్నది. మీపూర్వులచేత నెన్నిసారులో దవడలు పగులునట్లు చెంపకాయలు తిని యిఁకముందు మీచేతఁ బడరాని పాట్లుపడుటకు సిద్ధముగానున్న యావందనా నేను నా మనోహరునిగా నెన్నుకొనుటకు? చాలు చాలు! కల్పవృక్షముల నీడకన్న భూమిమీఁది యల్పవృక్షముల నీడయే నాకు మేలు.

ఉపసుం:—ఊర్వశిని వలపించిన యాతని చక్కఁదనము నీకుఁ బనికి రాదా?

జంబు:—నాభార్యకు నేను చక్కనివాఁడనైనట్లె యూర్వశి కింద్రుఁడు సొగసుకాఁడైనాఁడు.

తిలో:—అయ్యా! లోకో భిన్నరుచిః,

తే. గీ కోరి మిరపకాయల మెక్కు గోరువంక,
క్రొంజివుళ్లనె మెసవును గోకిలంబు,
పండులే దిని చిలుక దా బ్రతుకుచుండు
నెవరియిష్టము వారిదే యేమి చెప్ప. 28

జంబు:—మీకు మామిడిపం డిష్టము. నాకు తాటిపం డిష్టము.

సుందు:—ఇంద్రుఁడు నీకసహ్యమైన నవనిధులకు నాథుఁడైన కుబేరుఁడు కలఁడుగదా!

తిలో:—అయ్యా! దాంపత్యములు ప్రేమరసముచేఁ గూర్పఁబడఁదగినవి. ధనమే సౌఖ్యసాధనము గాదు. ధనము ప్రేమాగ్నిని రగుల్కొలుపు నింధనము గాదు. కుబేరుఁ డష్టావక్రుఁడు. వాని కన్నఁ గురూపి జగత్త్రయమున లేఁడు.

తే. మంచికులమందు జన్మంబు గాంచె ననుచు
ధనము గలదంచు నొకకురూపిని లతాంగి

నోటుక జాలక తా వరియించెనేని
మనికితము ఘోరదుఃఖభాజనము గాదె? 29

సుంద:—అట్లయిన సూర్యపుత్త్రుఁడు సమవర్తి దక్షిణదిగధీశ్వరుఁడు నైన యమునిమీఁద నీతలఁపు బాఱలేదా?

జంబు:—నాచక్కఁదనము యముని చక్కఁదనము నొక్కటె.

తిలో:—దేవా! అతఁడు నాకేగాదు. నాశత్రువులకైనను వద్దు. మసిబొగ్గులరాశివంటి యానల్లనిమేను, రంపములవంటి యాకోరలు, బందిపోటువాని చేతిలోని దండమువంటి యా కాలదండము, బడితలు చేతఁబూనిన బండవాండ్రవంటి యాతని కింకరులను, ఆతనిచుట్టును బరివేష్టించియుండు ప్రేతసంతతులను, వానిలోకంబున కరుగు మందభాగ్యులను బాధించుటకు నియమింపఁబడిన యినుపముక్కుల కాకులను, నగ్నిగుండములను క్రాగుచున్న తైలములను, వైతరణీప్రముఖములైన హేయంపు నదులను జూచిన పెండ్లివద్దురా నాయనా, పెందలకడ నావలకుఁ బోద మనిపించునుగాని వివాహముమీఁద బుద్ధిపుట్టదు. దున్నపోతు వాహనమెక్కి పెండ్లికొడుకు వచ్చెనా జనులకుఁ జూడఁ గన్నులుండవు. ఆతనికి నాశ్యామలాదేవికిఁ దగును.

జంబు:—ఇప్పుడు వానిం జూడకపోయినను జచ్చిపరత్రాప్తనైన వాని కడకుఁ బోకపోవులే.

ఉపసుం:—వారే నీకుఁ బనికిరానప్పుడు వరుణుఁ డక్కఱకువచ్చునా?

తిలో:—వరుణునిచేతనున్నది ప్రేమపాశముగాదు. అతనిని వరించుట నట్టేటిలో నిల్లు కట్టుకొనుటె.

సుంద:—అగ్నిహోత్రునిమాట?

జంబు:—అది బాగున్నది. శీతకాలము హాయిగాఁ జలి కాఁగవచ్చును. అందఱు నీయింటికే నిప్పుకొఱకు వత్తురు గాని నీవెక్కడికిఁ బోనక్కఱలేదు.

తిలో:—దేవతల మూటల మోపరి కాఁడా యతఁడు?

సుందు:—అది యేమిటి?

తిలో:—దేవతలకు హవిర్భాగములు మూటగట్టి మోసి తెచ్చుచుండును. ఒకప్పుడు మొగము రాజుచుండును. ఒకప్పుడు మండుచుండును. చల్లదన మతనికడ లేదు.

సుందు:—పోనీ! దిక్పాలకులయందు దోషములున్నవి. మహాత్ముండైన శంకరుఁడు నీయనురాగంబునకుఁ దానకముగాఁడా?

ఉపసుం:—ఔను! అతనియందు దోషమే లేదు.

ఆ. వె. ఇల్లు వెండికొండ విల్లు బంగరుకొండ
రథము రత్నగర్భ రాజు పువ్వు
నగము మేనియందు సర్వమంగళ యుండు
శంకరుండు లోకశంకరుండు. 30

జంబు:—శంకరునిసంసారము నాసంసారము నొక్కమచ్చునవెయున్నది.

తిలో:—సర్వలోకవంద్యుఁడగు పరమేశ్వరునియందు దోషారోపణ చేయుట పాపహేతువని యెఱుఁగుదునుగాని శాశ్వతమైన దాంపత్యము గుదుర్చుకొనునప్పుడు వరుని గుణాగుణంబులు వితర్కించుట దోషముగాదు. చిత్తగింపుఁడు—

సీ. దయ్యాలు భూతాలు దగ్గఱచుట్టాలు
యిల్లు వాఁకిలిజూడ వల్లకాడు
పులికలాసమెగాని మొలకు గుడ్డయులేదు
పునుకకంచమెగదా బువ్వదినఁగఁ
దలలెత్తి బుసకొట్టు త్రాఁచుబాములు నగల్
మొదలంట నెమ్మేన బూదిపూఁత
విసము కుత్తుకనిండఁ బెట్టుక మాటాడు
నెత్తిమీఁదను పెద్ద నీటినెలవు.

ఆ. వె. నిండుపౌరుషంబు నెఱసున్న వానికి
బొల్లి విఱిసినట్లు తెల్లమేను
తిరిపెమెత్తకుండ దినమైనఁ గడువదే
యేమి జూచి వలఁతు వామదేవు? 31

ఇఁక నాయన సంతానముమాట చెప్పనక్కఱలేదు. ఒక కుమారున కాఱుమొగములు పండ్రెండుకండ్లు. మఱియొక పుత్త్రుఁడైన గణపతివిషయము మీరే యెఱుఁగుదురు.

తే. గీ. ఎప్పుడు మదంబుగారెడి యేన్గుమొగము
పుట్టెడుండ్రాళ్లు భరియించు పొణకబొజ్జ
కొంపలను ద్రవ్వ పెనుపందికొక్కు గుఱ్ఱ
మాతఁ డగ్రగణ్యుఁడు తిండిపోతులందు. 32

కట్టుకొన్న పెండ్లాము కన్నమైనఁ దెచ్చిపెట్టలేని మగనితో నెట్లు కాఁపురము చేయవచ్చును. నేనుగూడ నొకపుఱ్ఱె చేతఁ బట్టుకొని యాయనవెనుక తిరిపెమునకు బైలుదేరవలెను. అది యటుండఁగా నొకభార్య నెత్తి నెక్కించుకొని మఱియొకదానికి సగముశరీర మిచ్చి యతఁడు పడఁతులకు బానిసయై యున్నవాఁడు. అట్టివాని నెట్లు చేపట్టఁగలను? పట్టితిననుకొనుము! ఒక సవతితో వేగుటె కష్టముగదా యిద్దరు సవతులతో నెట్లు వేగుదును? లోకమేమనుకొనునో యనుసందియములేక మగని నెత్తెక్కి త్రొక్కుచున్న యాసిగ్గుమాలిన గంగానమ్మతోను మగనిసామేను జీల్చి పుచ్చుకొన్న యాగయ్యాళి గౌరితోను నేను వేగలేను. కలహమంటె నాకెంతో భయము.

సుంద:—ఎంత నెఱజాణవే తిలోత్తమ! సురాసురవంద్యుఁడైన పరమేశ్వరుని నీవు పనికిమాలినవానినిగా వర్ణించుచున్నావు.

ఉపసుం:—నీవు కవయిత్రివలె నున్నావు.

జంబు:—ఈమెచెప్పినది నిజమే. శివునిస్థితికన్న నాయవస్థే బాగున్నది. నాకు మంచమున్నది. కంచమున్నది. గుడ్డయున్నది. తలదాచు కొనుటకు తాటియాకులగుడిశ యున్నది. శంకరునకవియు లేవు.

సుంద:—ఎల్లదేవతలయందు నేవో దోషములఁ జూపితివి. ఇంక నారా యణునివిషయమైయేమిచెప్పెదవు? అతనిని నీవువరింపఁగూడదా?

ఉపసుం:—ఆయనమాత్రము దోషరహితుఁడా?

జంబు:—ఈఁగ పుండుమీఁదనే వాలినట్లు లీమె దృష్టి దోషము మీఁదనే పడును.

తిలో:—మీ రిన్నివిధముల నన్నుఁ బ్రశ్నించుటచేత నేను నిష్కారణ ముగా దేవతాసార్వభౌములయెడలఁ దిరస్కారభావము జూప వలసివచ్చుచున్నది. అడిగినప్పుడు చెప్పకమానరాదు. నారా యణుఁడు దైత్యాంతకుఁడని యతని భాగ్యవశమున గొప్పపేరు వచ్చినది గాని నిజముగా నతఁడు మహేంద్రునివలెనే పిటికి వాఁడు. ఇందుకొక తార్కాణము. మహాపరాక్రమ సంపన్ను లగు మీదానవులకు జడిసి వారియెదుట నతఁడు నిజ రూప ముతో నిలువలేక యవతారము లెత్తెదనని వంకబెట్టి పగటివేష గాండ్రవలె నతఁడు మాఱువేసములు వేసికొని చేపయై తాఁ బేలై పందియై సింగమై మఱుగుజ్జువాఁడై లోకముపాలై పోవుట మీరు విన్నదేగదా! అదిగాక యతఁ డెట్టియందగాఁడు?

గీ. కాటుకయుఁబోలె నెమ్మేను కాఱునలుపు
జనవిరుద్ధమానట్లు హస్తములునాల్గు
బొడ్డులో పెద్దతామర మొలచియుండి
కాళ్లు నీళ్లోడుచుండు నేకాలమందు. 33

అది యటుండనిండు. ఆలివంకవా రాత్మబంధువులని నీరజాక్షుఁడు నిజనివాసమువిడిచి పాలసముద్రమున వసియించు

చున్నాఁడు. పెండ్లాముమాటవిని యిల్లువాకిలివిడిచి యత్తవారి పంచఁజేరిన దామోదరుఁ డెట్టిగౌరవమున కర్హుఁడు? మరియు,

తే. గీ. విసము గ్రక్కెడు పెనుబాము వెడఁదపాన్పు
పక్షపాతముగలపక్షి వాహనంబు
తిరము లేకుండ నిల్లిల్లుఁ దిరుగునాలి
వలను నీరజాక్షునిపొత్తు వలను నాకు. 34

ఆయనను బెండ్లాడినపక్షమున నేనుగూడ నాసవతి పుట్టినింటికి బోయి లెక్కలేనన్ని యప్పులలో మునిఁగి బహుభంగసంగత మైన నడిసముద్రములోఁ గాపురము చేయవలెను. పెండ్లి లేకున్న బ్రహ్మచర్యముతోనే కాలముగడపవచ్చును గాని యట్టివాని పొందు నేను కలలోనైన నపేక్షింపను.

సుంద:—శహబాస్, తిలోత్తమా, శహబాస్, తుంటరియైన యా నారాయణుని వాలకమును, దుర్గుణములును, సంసారదుర్దశను నెట్లు వర్ణింపవలయునో యట్లు వర్ణించితివి. ఇందుకు నీకు బహుమానముగా నేను వైకుంఠయాత్రకు వేంచేయునప్పుడు లక్ష్మీనారాయణుల నందుండి పాఱద్రోలి నిన్నే దానికధిష్ఠానదేవతగాఁ బ్రతిష్ఠింతును. నీవచోనైపుణ్యమున నారాయణుఁడు వట్టి నిర్భాగ్యుఁడని నిరూపించితివి.

ఉపసుం:—వాక్చాతుర్యముచేత నీమె బొగ్గును వజ్రము, వజ్రమును బొగ్గు చేయఁగలదు.

జంబు:—మొదట బోగముది, అందులో దేశద్రిమ్మరి— నోటికి తలుపు ద్వారబంధములు లేవు. సిగ్గు బిడియము లంతకన్న లేవు.

సుంద:—జంబుక! మర్యాదనతిక్రమించి మాటాడకుము.

జంబు:—ఓహో! అప్పుడే యభిమానము మొదలుపెట్టెనదా?

ఉపసుం:—అభిమానముగాదు, ఈమె పూజ్యురాలగుటచే మాయన్న యట్లనియె.

జంబు:—అట్లయిన నేను గన్నేరులు మల్లెలు మొల్లలు జాజులు విరజాజులు మొదలైన పూవులఁ దెచ్చెదను. మీ యన్నదమ్ము లిద్దరు జెరియొకవైపు గూర్చుండి పూజించుఁడు.

సుంద:—జాబుకా! నీప్రసంగము కట్టిపెట్టుము. కల్యాణి! మహాప్రభావసంపన్నులైన దివ్యులలోనే నీకనుకూలవరుండు లభింపనప్పుడు నింక మర్త్యపాతాళ వాసులలోనా దొరకుట? రత్నాకరములో దొరకని మణులు చెఱువులలో దొరకునా?

తిలో:—ఉద్యానమున దొరకనిపుష్ప మొకప్పుడు కారడవిలో దొరకవచ్చును.

జంబు:—వాన కురిసినప్పుడు వీధిలోని యిసుకలో జలగడుగువారికి బంగారము దొరకినట్లు నీ కీ లోకమున వరుఁడు లభించును గాఁబోలు!

సుంద:—అంతవఱకు నీ వెక్కడనుందువు?

తిలో:—మీయనుజ్ఞ యయ్యెనేని గొంతకాల మిందే యుండఁదలంచుచున్నదానను.

ఉపసుం:—నాకలోకసుఖములుమఱఁగిననీకు మాయూరు రుచించునా?

తిలో:—రుచింపకేమి!

తే. గీ. నందనముబోలుపూఁదోఁట లిందుఁగలవు
మేడలును వైజయంతము మించి యుండె
నింద్రుఁ డిచట లేకున్న దైత్యేంద్రు యింట
నాకు నీప్రోలు గనఁబడు నాకమట్లు. 35

జంబు:—పాపము! ఎక్కడికక్కడే, సరిపెట్టుకొనఁగలదు.

సుందు:—నీవిక్కడనుంట మమ్మనుగ్రహించుట.

ఉపసుం:—మాపట్టణమునకు నీవు నవీనాలంకారమవుగదా!

సుందు:—జంబుకా! మధుసాగరమను మనయుద్యానవనమున చంగల్వ కొలని యొడ్డుననున్న చంద్రకాంతసౌధమునం దీమెను నిలుపుము. ఈమెకుం దగిన యుపచారము లన్నియుం జేయుటకు మన యంతఃపుర పరిచారికల నియోగింపుము. అంద ఱామె కనుసన్నల మెలంగవలయునని నొక్కిచెప్పుము.

ఉపసుం:—పాలుమాలినవారు దండింపఁ బడుదు రని స్పష్టముగాఁ జెప్పుము.

జంబు:—చిత్తము దేవా! చిత్తము. (తనలో) మాకర్మముకాలినది. ఈ తొత్తుకూఁతురు నాశ్రయింపలేక యూడిగముల సేయలేక మేము చావవలెను. ఈ మాయలమారి యీ యన్నదమ్ముల నిద్దఱిని బుట్టలోఁ బెట్టినది. చేఁపలు వలలోఁబడినవి.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది

ద్వితీయాంకము.



# తిలోత్తమ

## తృతీయాంకము

### రంగము 1—ఉద్యానవనము

[ అంతట వెన్నెలలో నొకపానుపుపైఁ బండుకొని సుందుఁడును, జంబుకుఁడును ప్రవేశించుచున్నారు ]

సుందు:—జంబుకా! కారణములేని యాహరితాప మెట్లువచ్చెనని నీవు పలుమాఱు గ్రుచ్చి గ్రుచ్చి యడుగుచుంటివి. కావునఁ జెప్పెద వినుము. ప్రథమదర్శనంబుననె తిలోత్తమ నాహృదయ మపహరించుకొని పోయినది.

ఉ. ఆచిఱునవ్వు లాబెడఁగు లాసువిశాలవిలోచనద్వయం
బాచతురోక్తు లానడలయందము నాహావ లాయొయారముల్
మేచకమైన యాకచము మిత్రుఁడ! చేరి మఱొక్కసారి నేఁ
జూచినదాఁక నామనసు సొక్కుచు సోలుచు నున్న దీక్రియన్. 1

జంబు:—మొదట నేననుకొన్నంతపనియైనది. ఆపిశాచ మేనిన్నుఁబట్టినది.

సుందు:—జంబుకా! అది పిశాచమా? అంధునకు రత్నము రాయి వలెఁ దోఁచునట్లు నీకాజగన్మోహనాంగి దయ్యమట్లు కనఁబడుచున్నదా చూడు!

ఉ. చూచితి నప్సరాంగనలఁ జూచితి వేలుపుటంచయానలన్
జూచితి నాగకన్యకలఁ జూచితి నెందఱొ మర్త్యకాంతలన్
జూచియెఱుంగ నిట్టి బలుసోయగముల్ నెఱజవ్వనంబు నే
నేచిగురాకుఁబోఁడికడ నిట్టిపడంతుక యెందు లేదుగా. 2

జంబు:—తావలచినది రంభ తా మునిఁగినది గంగ యను సామెత నిజము. నీకంటికి నచ్చలేదుగాని దీని తలదన్నిన యందగత్తియ లెందఱో లోకమున నున్నారు.

సుందు:—నీవు సరిగా నాలోచించుకొని మాటలాడలేదు. ఈ యంద మేమందఱియాసలయందుఁ గనుఁగొనము. చూడు!

సీ. పడఁతి కట్టుటచేతఁ బసిఁడిసువ్వాలువకు
నెన్నఁడు లేనట్టి యెసకమెసఁగె
రమణి తాల్చుటచేత రతనాలనగలకు
వర్ణనాతీతమౌ వన్నెగలిగె
మగువ పూయుటచేత మంచిగందమునకు
రమణీయమైన సౌరభ్య మొదవె
యెలనాఁగ తుఱుముట నలరుగుత్తులకును
గమనీయతరమైన కాంతి యొదవె
గీ. యువిద సంచార మొనరించుచున్న కతన
నవనికంతకు నొకవింత యంద మొదవె
తెలవ స్వేచ్ఛమై యిందమునఁ దిరుగుచుంట
వేల్పువీటికి నెంతేని వెలితి గలిగె. 3

జంబు:—ఈ తిలోత్తమకూఁతురు రాఁబట్టి భూలోకమున కందము స్వర్గము నకు వెలితి వచ్చినదా? స్వర్గలోకమునకు శనిపీడ వదలినది. అది మనలోకమునకుఁ బట్టుకొన్నది. ఈ పిచ్చిపిచ్చి తలంపులు మాని యీ నిండుచందురుని పండువెన్నెలచలువ హాయిగా ననుభవింపవయ్యా! చన్నీళ్లలోఁ బ్రవేశించిన దున్నపోతులాగు నేనెంతో చల్లఁదనపుసౌఖ్య మనుభవించుచున్నాను.

సుందు:—జంబుకా!

తే. గీ. నిండుజాబిల్లిగా దది నెలఁతమొగము
పండువెన్నెల గాదది పడఁతినవ్వు

మచ్చగానును మ్మది మృగమదపుబొట్టు
తార లవిగావు దానిముత్యాలసరులు. 4

జంబు:—సరి సరి! ప్రపంచమంతయు నీకు నేఁటిరేయి తిలోత్తమా విలాసమువలెఁ గనఁబడుచున్నది గాఁబోలు! కామిలరోగము గలవానికి జగత్తంతయుఁ బచ్చనైనట్లు కామగ్రహబాధితుఁడ వైన నీకుఁ దిలోత్తమ తప్ప నొండువస్తువు కానఁబడుటలేదు గాఁబోలు!

సుందు:—మిత్రుఁడా! ఒక్కసారి తిలోత్తమ నిక్కడకుఁ దీసికొని రాఁగలవా?

జంబు:—అబ్బో! దాని పెకుకులు దానిబెట్టుసరి చెప్పనలవిగావు. అది యిక్కడికి వచ్చునా?

సుందు:—పోనీ! నన్నక్కడికిఁ దీసికొనిపోదువా?

జంబు:—తీసికొనిపోయెడిదేమి! బుజముమీఁద నెక్కించుకొనవలెనా యేమి? నీవెంట నేనువచ్చెద నడువుము. జగత్త్రయ విజయ బాహుబలసంపన్నుఁడ వగు నీవు దానిదగ్గఱకుఁ బోవుట యుక్తముగాదు. ఇంతబతుకుబతికి యింతతపస్సుచేసి భోగముదాని దర్శనమునకా నీవు పోవలసినది!

సుందు:—జంబుకా! దాని దర్శన మెంతటి యదృష్టవంతుల కగును? అది సులభమని తలంచుచున్నావా? అది అనుగ్రహించినచో నింద్రాదిదిక్పాలకులు, నారాయణాదులు దానికి నమస్కరించి తమ మకుట మాణిక్య కాంతులచే దాని చరణారవిందములకు నీరాజన మొసంగరా? అది కనుసన్న జేసినమాత్రమునఁ దేనె చుక్కపై నీఁగలు ముసరినట్లు ముక్కోటిదేవతలు దాని చుట్టు మూఁగియుండరా?

జంబు:—అయ్యా! నేనుమాత్ర మట్లు తలంచుటలేదు. ఈ మిండకత్తె

దేవతలలో నెవరికిఁ బనికిరాకపోవుటచేతనే యీలోకమునకు వచ్చినదని నేను తలంచెదను. అట్లు కానియెడల స్వర్గముకన్న మర్త్యలోకములో నేమియతిశయమున్నదని వచ్చినది? ఇక్కడ నంతకంటె నెక్కువ చక్కనివాండ్రు కలరా? అంతకంటె నెక్కువ భోగ్యవస్తువు లున్నవా? అంతకంటె నెక్కువవైభవ మున్నదా? ఎక్కువ శూరశిఖామణు లున్నారా?

సుందు:—ఓరి మూర్ఖుఁడా! అక్కడ తనమనంబునకు నచ్చినవారెవ్వరు లేకపోవుటచే నిక్కడకు రావలసెనని యది నొక్కి వక్కాణింప లేదా? ఆమాటలు నీవు వినలేదా?

జంబు:—ఇది వట్టిబూటకము. అది యేదోపన్నుగడ పన్నుకొని వచ్చినది. అది కల్లలకుఁ బుట్టినయిల్లు. భోగముదాని నోటికి శుద్ధి బద్ధ మున్నదా?

సుందు:—జంబుకా! నీవట్లన్న నేనొప్పుకొనను. నిజముగాఁ జెప్పు. వేల్పులలోఁ జక్కనివాఁ డెవఁడు? అదియన్నమాటలు శిలాక్షరములు.

జంబు:—అట్లయినఁ బదునాల్గులోకములలో నీవొక్కఁడవే చక్కనివాఁడవని నిన్నువలచి పైఁబడవచ్చినదా?

సుందు:—ఏమో యెవరిని వలచివచ్చినదో? ఈ వృథాప్రసంగమేల! దానికడకు నీవుపోయి దాని నిక్కడికిఁ బిలుచుకొనివత్తువా లేదా? నేను తాళఁజాలకున్నాను. విరహతాపము దుస్సహముగా నున్నది.

గీ. పొడుచుచున్నాఁడు చంద్రుండు పొడవులయిన
కిరణశూలంబులను నన్నుఁ గరుణ లేక,
యేయుచున్నాఁడు మన్మథుం డేపుమీఱఁ
దీయవింటఁ బూవులు గూర్చి తెఱపి యిడక. 5

జంబు:—తడిసిన నూలుపోగులలాగున నెంతో చల్లగానున్న చంద్ర కిరణములు నీకు శూలములలాగున్నవా? మా నాయనమ్మ పండుగనాఁడు గోడకుఁ బెట్టిన సున్నపుచుక్కలవలె నీచుక్క-లెంత యందముగా నున్నవో చూడు! ఆహాహా! ఈచంద్రుఁడు పెద్ద కచ్చికవలె నున్నాఁడు. కచ్చికనంటుకొన్న మసిబొగ్గువలె దానిలో నల్లనిమచ్చ కనఁబడుచున్నది. ఇటువంటిసమయములో సౌఖ్య మనుభవింపలేక యుస్సురస్సురని తాపపడియెదవేల? అదిగాక మన్మథుఁడు తియ్యవింటిలో, పూవులుగూర్చి నిన్నుఁ గొట్టుచున్నాఁడా? ఏదీ! యొకపువ్వైన నాఁ గనఁబడదేమి? ఈ విరహతాపాలు— ఈ కోపాలు మేమెన్నఁ డెఱుఁగము. మన్మథుఁడు మమ్మెప్పుడు కొట్టఁడేమి? వానిమొగముమండ వాఁడు గొప్పవారినేగాని పువ్వులతోఁ గొట్టఁడేమో!

సుంద:—ఓరిమూర్ఖుఁడా! విరహతాప మనుభవించినవారికే తెలియును. ప్రసవవేదన బిడ్డఁగన్నదానికేగాని గొడ్రాలికిఁ దెలియునుగదా! మన్మథబాణప్రహారములు కంటికగుపడనిదెబ్బలు. మన్మథుఁ డనంగుఁడుగదా!

తే. గీ. ఎదుట నిల్చి పోరెడుశత్రు నెట్టులైనఁ
జలముఁ బలము పెంపునుజూపి గెలువవచ్చు,
చాటుదెబ్బలు గొట్టెడు సాహసులను
నెట్టి బలశాలియైన జయింపఁ గలఁడె? 6

అందుచేతనే,

గీ. కాలదండంబునకు రుద్రుశూలమునకు
శక్రువజ్రంబునకు విష్ణుచక్రమునకు
జడిసి మెఱుఁగని నే నిప్డు జడియువలసెఁ
గమ్మవింటికి నలపూవుటమ్ములకును. 7

జంబు:—ఓయినాయనా! ఇటువంటి బాధలు వేయిజన్మములకైన నాకు వద్దు. ఇవన్నియు మీరే యనుభవింపుఁడు ఈ విధముగా నాతో తహతహ పడునటువంటి మీరు స్వర్గలోకదండయాత్ర కెట్లు బైలుదేఱుదురు? శంబరుఁడు సేనల సిద్ధముచేసినాఁడు. తలకొక గుటకెఁడమృత మెప్పుడు త్రాగనగునని రక్కసులు మిక్కిలి యువ్విళ్లూరుచున్నారు. నీవుఁగూడ నమృతపానము జేసి చిరకాలజీవివి కావచ్చును నాకలోకనివాససౌఖ్య మనుభవింప వచ్చును.

[ అంతట శంబరుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

శంబ:—(తనలో) దండయాత్రాసన్నాహమంతయు సిద్ధమైనది. ఈ వార్త సుందమహారాజుతో విన్నవించెదను.

సుందు:—జంబుకా!

ఆ. వె. అదియె యమృతభాండ మదియె చింతామణి
యదియె వైజయంత మదియె స్వర్గ
మదియె కల్పవృక్ష మదియె నందనవనం
బదియె విజయలక్ష్మి యరయ నాకు 8

శంబ:—దేవా! జయము. జయము.

సుందు:—జంబుకా! వింటివా?

(అని పై పద్యమునే మరలఁ జదువుచున్నాఁడు)

శంబ:—మహారాజా! జయము జయము.

సుందు:—(కన్నులు మూసికొని మాటలాడఁడు)

శంబ:—జంబుక! ఇది యేమి?

జంబు:—నీపిండము నాశ్రాద్ధము. ఏమనిచెప్పుదు?

శంబ:—ఏమిరా! అట్లు ప్రేలుచున్నావు?

జంబు:—నేను ప్రేలుటలేదు. మహారాజుగారియవస్థ మాఱిపోయినది.

మనము దేవతలమీఁదికి దండువెడలఁదలఁచుకొన్నవార్త విని వారు మహారాజుగారిమీఁదికి మన్మథునిబంపినారు. ఆచాఁటున నుండి యీచాఁటుననుండి వాఁడు మహారాజుగారిని కళ్లఁ బొడుచుచున్నాఁడు.

శంబ:—నీ చమత్కారభాషణములు గట్టిపెట్టి స్థితియేమో చెప్పరా?

జంబు:—స్థితి దుస్థ్సితి. అవస్థ మన్మథావస్థ. మనమాట లాయనకు వినఁబడుటలేదు. ఆయన తిలోత్తమను వలచియున్నాఁడు. దానిని నీవు తీసికొనివచ్చితివా నీతో నాయన మాటాడును.

శంబ:—మన దండయాత్ర గంగలోఁ గలిసినది.

జంబు:—ఆదొంగతొత్తుకూఁతు రెప్పుడువచ్చినదో యప్పుడే గంగలోఁ గలిసినది.

శంబ:—ఇప్పు డీ సంగతి యీయనకు విన్నవించుటెల్లు?

జంబు:—ఈయనను మేలుకొల్పుటకు నేనొక చమత్కారము జేసెద నుండు.

శంబ:—ఏలాగో నీతెలివిచేత మెలకువ తెప్పించుము.

జంబు:—మహారాజా! ఇదే తిలోత్తమ వచ్చినది. లెండు. లెండు.

సుంద:—(కన్నులు మూసికొని లేచి) ఏదీ నాప్రాణసఖి? ఏదీ నా బహిఃప్రాణము? ఏదీ కామదేవునినూతనశస్త్రము. (అని జంబుకుని కౌఁగిలించుకొని దాడకొటికి ముద్దుపెట్టుకొనుచున్నాఁడు)

జంబు:—అయ్యో! అయ్యో! నేనుగానయ్యా తిలోత్తమను. నేను మీవేడుక చెలికాఁడను. జంబుకుఁడను. జంబుకుఁడను. నీముద్దు ముక్కలైపోను! నన్ను ముద్దుపెట్టుకొనకు.

శంబ:—దేవా! వీఁడు మన జంబుకుఁడు. విడిచిపెట్టుము.

(అని చెయిబట్టుకొని లాగుచున్నాఁడు)

సుంద:—ఏమీ! వీఁడు మన జంబుకుఁడా, తిలోత్తమకాదా?

జంబు:—అయ్యో! నీవిరహాతాపము మండిపోను. నాబుగ్గ చెడఁగొట్టితివి నావు. అయ్యో! చిమ చిమ లాడుచున్నది. (చేతితో తడిమి) అయ్యో! నెత్తురు వచ్చుచున్నది. మానిసికాటుకు మందులేదు. అయ్యో! నేను చచ్చిపోదునుగాఁబోలు! ఇఁక నాభార్యకెవరు దిక్కు? పాపము! దానికి నేనొక్కఁడనె మగఁడను గదా? దాని బ్రతు కేమగునో?

శంబ:—ఓరీ, మూర్ఖుఁడా! ఇది నీస్వయంకృతాపరాధము. తిలోత్తమ వచ్చినదని చెప్పఁబట్టి మొకటనున్నమానిసి తిలోత్తమ యని యాయన నిన్ను కౌఁగిలించుకొన్నాఁడు. తెలివితక్కువపని చేసినందుకు ఫల మనుభవింపవలసినదే.

జంబు:—నాకేదైన మందు చెప్పవయ్యా! లేదా వైద్యునింటికిఁ దీసికొనిపో.

శంబ:—భయపడకు! అది చొంగగాని నెత్తురుకాదు. కాటు లోతుగా పడలేదు.

జంబు:—నేనీదినమున నాతిలోత్తమ మొగము చూచినాను. ఆపాడు మొగము చూచినందుకు నెత్తురు కన్నులఁ జూడవలసివచ్చినది.

సుందు:—మూర్ఖుఁడా! నాయంతరము నీయంతరము దెలియకుండ నాతోఁ బరిహాసమాడెదవా? దాని కిదేశిక్ష.

జంబు:—నాతల్లికడుపుచల్లగా, నాపెండ్లాము మంగళసూత్రబలిమిచేత నేను నేఁడు పులినోటి కండవలె బయలుపడినాను. నీ విరహాతాపము బంగారుగాను! ఎంతపని చేసితివయ్యా.

శంబ:—(తనలో) కామార్తులకు స్త్రీపురుషభేదము, చేతనాఽచేతనభేదము తెలియదన్నమాట నేఁడు సార్థకమైనది.

సుందు:—శంబరా! ఈ రాత్రివేళ నీ వేల వచ్చితివి?

జంబు:—నన్ను కఱపించుటకు వెఱపించుటకు.

శంబ:—దేవా! నాకలోకముపై దాడివెడలుటకు సకల సేనా సన్నాహము చేసి యుంచినాను. దేవరవారి మహాసేన మదగజంబులను కొండలును, తురంగంబు లను తరంగంబులును, పదాతులనెడు మత్స్యమకరనికరంబులును, రథంబు లనియెడు నోడలును గలిగి మహాసముద్రంబు తెఱంగున భయంకర కోలాహల సమేతంబై యున్నది. దేవరవారి యాజ్ఞ యయ్యేనేని,

సీ. కాల్బలంబుల పదాఘాత ఘట్టనలచే
శేషాహిపడగలు చిదుకునట్లు
భద్రదంతావళ భయద ఘీంకృతులచే
దిగ్గజంబులతలల్ దిరుగునట్లు
పటహకాహళ భూరి భాంకరణంబుల
గగనమండలమెల్లఁ గలఁగునట్లు
తురగరింఖాసముద్భూత రజంబుచే
భానుమండలి కానఁబడనియట్లు
గీ అసురకోటుల గుండియ లవియునట్లు
వేల్పుచేడెల గర్భము ల్వీచ్చునట్లు
స్వామి! నీసేన యాత్రవిన్యపముమీఁద
నడచుఁ బగునాల్గుభువనంబు లడలునట్లు. 9

సుంద:—శంబరా! మేమిప్పు డస్వస్థముగానున్నారము. మాకు మన స్స్థిమితము లేదు.

శంబ:—ఇంతలోనే దేవరవారి కింత యస్వస్థతకల్గుటకుఁ గారణమేమి? సెలవయ్యేనేని ప్రతికారవిధానము చేయించువాఁడను.

జంబు:—బాబూ! నీవు వైద్య మారంభించినావా భూభార మణఁచి వేయుటకు? నీ మాత్రలు పగవాని కుపయోగింపుము గాని మిత్రునిమీఁద నుపయోగింపకుము.

సుంద:—శంబరా! నీకుఁ గారణములతోఁ బనిలేదు; నీచికిత్సలతో మాకవసరము లేదు.

శంబ:—దేవా! దేవరవారి హితాభిలాషి నగుటచే నే నొక్కమాట మనవిసేయుచున్నాను. ఆగ్రహింపకుందురుగాక! తిలోత్తమను జూచినదాదిగా మీచిత్తంబు తదాయత్తమై యున్నట్లును దాని సమాగమ మపేక్షించి మీ రిప్పుడు మనస్తాపము నొందుచున్నట్లును నాకుఁ దోఁచుచున్నది. తిమితిమింగిలములవంటి మీసోదరుల బాధింపఁదలఁచి దేవతలు పంపినయెఱ గాని, ఇది యంగన గాదు. నారాయణుఁడు తొల్లి జగన్మోహనావతారముం దాల్చి దానవుల వంచించినట్లె జగన్మోహనమైన యీ యంగనగూడ దానవుల భంగపుచ్చుటకే వచ్చినది. దానిహాసములు మోసములు. దానివిలాసములు సౌఖ్యాభాసములు. దానినోట నమృతరసము, మనస్సులో విసము గలదు. మీరు వంచింపఁబడుచున్నారు. గాఢమోహనిద్రనుండి మేల్కొనుఁడు. ఇది కాముని సమ్మోహనాస్త్రమువలె మిమ్ము మైమఱచునట్లు చేసినది.

గీ. తరుణి లావణ్యరసమును దనివితీఱ
మీరు నేత్రాంజలులఁ గ్రోలి మెదలకుండ
మద్యపానంబు చేసిన మనుజులట్ల
నొడలెఱుంగక చెడిపోవుచున్నవారు. 10

సుంద:—మూర్ఖుఁడా! నీవు మాకు చక్కటులుం దెలుపవచ్చితివా? నీ హితోపదేశములు చాలు! నేను చతుర్దశభువన నాయకుఁడను. దానవసార్వభౌముఁడను. నీవు సేవకుఁడవు, దాసుఁడవు.

శంబ:—అది నేనెఱుఁగుదును. మీరు కోపగించినను సరే నాస్వామిభక్తి మరల నట్లే పలుకుమని నన్ను పురికొల్పుచున్నది.

సుంద:—అట్లయిన నాయాజ్ఞ వినుము! పరాయత్తచిత్తులు యుద్ధము వంటి యుత్కృష్టకార్యముల సామర్థ్యముతో నెఱవేర్పఁజాలరు. కావున నీవిప్పుడ యుపసుందునిపాలి కరిగి సకల దానవసైన్యంబులతో, త్రిదశాలయముపై దండువిడియుమని నామాటలుగా నాతనితోఁ జెప్పుము.

శంబ:—చిత్తము దేవా! అట్లు చేసెద.

జంబు:—ఇక్కడీదొరగారి‌తచేసినారు ఇఁక నాయనగారా కార్య సిద్ధి చేయువారు?

శంబ:—ఆహా! ఏమి కాలవైపరీత్యము. ఈ పుడుగుముండ పిడుగువలె వచ్చి యీయన యుత్సాహవృక్షమును మాడ్చివైచినది. ఇఁక నుపసుందుఁ డేమనునోగదా! ఆయన యీయనతమ్ముఁడు గాఁడా? ఆయన యేప్రవాహములోఁ గొట్టుకొనిపోవుచున్నాఁడో? అయినను ప్రయత్నించెదఁగాక!

(అని నిష్క్రమించుచున్నాఁడు)

జంబు:—అయ్యా! మీకిప్పటికి శనిగ్రహము వదలిపోయినది. మరల మీరు తిలోత్తమను ధ్యానించుకొనుచు నుండవచ్చును. స్వర్గ దండయాత్రనుగుఱించి మిమ్ము నడుగువారు లేరు.

సుంద:—జంబుకా! నామనస్సు స్వర్గమువిూఁదికిఁ బోవుట లేదు.

గీ. సఖియ సంసర్గముండఁగ స్వర్గమేల?
యతివవాగమృతంబుండ నమృతమేల?
తరుణి పృథునేత్రవారిజాతంబు లుండ
పారిజాతంబు లేల? నిష్ఫలము గాక! 11

జంబు:—వెట్టికి వేయివిధములు. ఒకని కాఁడుదానివెట్టి; ఒకనికి సొమ్ము వెట్టి. అందులో నిదొకటి. నేను రెండులొట్టె లీఁతకల్లు త్రాగి

నను నాకెన్నఁడు నింతమైమఱపు రాలేదు. సురచేయనిపని సురకాంత క్షణములోఁ జేసినది!

సుంద:—అందఱిని వెక్కిరించువెఱ్ఱి నీవి. ఈ వెఱ్ఱులకేమిగాని తిలోత్తమ యొద్దకుఁబోయి నాయలమట దానికి విన్నవించి నాపై ననుగ్రహము గలుగునట్లు చేయుము.

గీ. తపము సుంకుఁ డెల్లప్పుడు దాసుఁ డనుము
ప్రీతిఁ దన్నె పట్టపుదేవిఁ జేతు ననుము
ఇందుముఖులచే సేవ జేయింతు ననుము
నెనరు లేకున్నఁ బ్రాణము ల్నిలువ వనుము. 12

పో! వేగముపో! ఆలస్య మమృతం విష మ్మనుమాట నెఱుఁగవా?

జంబు:—అయ్యా! ఇదిగో పోవుచున్నాను. పోవకున్నచో బ్రతుకఁ గలనా? (తనలో) రాజునకు వేడుకచెలికాఁడగువాఁడు తన యజమానుని ప్రియురాండ్రకు రాయబారములు గొనిపోవుట, వారి కలయికలకుఁ దగినచోటులు వెదకుట, మిండకత్తెలం దార్చుట యను మహాకార్యములం జేయవలసిన వాఁడే. ఏయుద్యోగమైనఁ జేయవచ్చునుగాని పరమనీచమైన యీతార్పు పని చేయఁగూడదు. జీవించుటకు గౌరవమైన వృత్తి యేదైనను లేక, కుటుంబమును పోషించుకొనలేక యీపాడుపని చేయుట కొప్పుకొనవలసివచ్చె. అది యేమనునో? తన్నునో— కొట్టునో— తిట్టునో? వెళ్లకపోయిన నితఁ డాపనియే చేయును. దిక్పాలకులను దేవతలను ధిక్కరించిన యీదేశద్రిమ్మరిముండ, మెలుఁగు గొడ్డువలె శరీరమంత నల్లని రోమములుగల్గి బొగ్గులబుట్టవలె నున్న యీయయ్యను వరించి వచ్చి మీఁదఁబడునా? ఇది నా నడకచేటేగాని మఱొకవిధముగాఁ బరిణమించదు.

---

రంగము 2—నుతిమొక యుద్యానవనము

[అప్పుడు పీఠముమీఁదఁగూర్చుండి ఉపసుందుఁడు, వేడుకచెలికాఁడగు శౌనకుఁడు ప్రవేశించుచున్నారు]

ఉపసు:—శౌనకా! చీఁకటిపోయి వెన్నెల యెంతమనోహరముగా వచ్చినదో చూడు.

తే. గీ. కాలపురుషునికొఱకు నిశాలతాంగి
బత్తి గగనతల్పంబునఁ బఱచినట్టి
తెల్లదుప్పటియట్లు చంద్రిక దనర్చె
దానిపైనున్న పూలట్లు తార లలరు. 13

శౌన:—మానాయనమ్మ గంజివార్చుకొనుట కుపయోగించు చిల్లియి త్తడిసిబ్బివలె నీచంద్రమండలము నాకంటి కగుపడుచున్నది. నేను చిన్నప్పుడు మొలకు మెడకుఁ గట్టుకొన్న గవ్వలగుత్తులవలెఁ జుక్కలు కనఁబడుచున్నవి.

ఉపసు:—ఆహాహా! ఏమి యీమలయమారుతసౌకుమార్యము. ఏమి యీ వెన్నెలచల్లఁదనము. ఏమి యీ యుద్యానవన రామణీయకము అన్నియు నాకత్యంతానందము నొసఁగుచున్నవి, కాని యిట్టిసమయమున నానందపరిపూర్తిచేయు ప్రేయసి లేకపోవుట గొప్పలోపముగదా!

శౌన:—అట్లయిన నీప్రేయసియున్న యంతఃపురమునకుఁబొమ్ము! నీదేవియైన వజ్రజ్వాల సకలాభరణభూషితయై పడకటిల్లు సింగారించుకొని నీరాక నిరీక్షించుచుండును.

ఉపసు:—వజ్రజ్వాల నాకు నిన్నటివఱకే ప్రియురాలు.

శౌన:—అదియేమట్లనుచున్నావు?

ఉప:—మూర్ఖుఁడా! నీకుఁ దెలియలేదా?

గీ. నాకనులచందమామయు నామునిధియు
నాకుప్రాణంబు నాకుపుణ్యములపంట
నాయదృష్టదేవతయును నాధనంబు
నేఁగడయుఁ దిలోత్తమ యెఱుఁగు మిఁక. 14

శౌన:—అయ్యో! నేనిఁకను బెరటిదారినే యున్నాను. ఈ వన్నెల విసనకఱ్ఱ— యీ మాయమాఱి— యీ టెక్కుల యెక్క— యీ బొంకులబుంగ— యీ కొంపలమాపెకుకోఅవి— యీ సంగనాచి, యెఱ్ఱగా— బుఱ్ఱగా వేసాలువేసుకొని, మొగము మెఱుఁగులు పూసికొని, యెక్కడివో యెరువుఁగలు వేసికొని రాఁగానే దాపిమాటలకుఁ జిక్కి నాగస్వరమువిని పాములవాని చేతఁ జిక్కి సర్పమువలె నీవు దానికి లోఁబడితివా? దీనితో నీప్రతాపముసరి.

ఉపసుం:—మిత్రుఁడా! నీవన్నమాట నిజము!

గీ. మదిఁ బ్రతాపంబు ప్రీలెను మదనతాప
మంతకంతకు నతిశయ మగుచునుండె,
కత్తులను బూనవలెనన్నకాంక్ష జాఱెఁ
గలికి పొత్తులపైఁ బాఱెఁ గలఁగి మనసు. 15

శౌన:—అయ్యా! నీయంతఃపురకాంతల కన్న నీవగలాడి యెక్కుడు సొగసుకత్తియ యని యామెంగూర్చి మేలుపడితివా? అధిక గుణవంతురాలని దానికై యాసపడితివా? చేసువచ్చునని చేరఁదలఁచితివా?

ఉపసుం:—మూఢుఁడా! నాయంతఃపురకాన్తలలావణ్యము దానిచరణ పల్లవంబులకు దాస్యము చేయుటకైనఁ దగదు. నాకాంతల సౌందర్యమే గాదు— సకల దైవాంగనా లావణ్యమును దీని సోయగముముందు దిగదుడుపుపెట్టుటకైనఁ బనికిరాదు. దాని ప్రభావ మెట్టిదో గెఱుఁగుదువా? చూడు!

సీ. హరుఁ డీమె కెమ్మోవి యమృతంబుఁ గ్రోలిన
విసము మేసిన నోటి వెగటు పోదె?
చంద్రుఁ డీలావణ్యజలధిలో నీఁదిన
మలినమా తనమచ్చ మాయకున్నె?
పుష్పబాణుఁడు దీని పొందుగల్గెడు నేని
దనమేను వెండియుఁ దాల్పకున్నె?
నరహరిపై దీనినవ్వువెన్నెల పడ్డఁ
దనమేని నలుపెల్లఁ దఱుగకున్నె?
ఆ. వె. మునిజనంబు దీని ముఖమండలముఁ గన్న
జపము విడిచి యుగ్రతపము విడిచి
యెల్ల నీతి విడిచి యెదవోవు గిత్తల
విధముదోఁప దీనివెంటఁ బడరె? 16

శౌన:—పై మెఱుపులఁజూచి నీవు మోసపోవుచున్నావు. ఇది మేడి పండు వాటముగా నున్నది. మెఱయుచుండునదెల్ల మెఱుపు గాదు. కొంగయు హంసవలెనే తెల్లగానుండును.

ఉపసుం:—ఎఱుకగలిగి మాటాడుము. అంతయు నేనెఱుఁగుదును. ప్రపంచమునం దెవ్వరును దానికి సాటిరారు. దాని నుపమింపఁ దగు వస్తువులు లేవు చూడు!

గీ. అప్పుడప్పుడు కళాహీన మగుచునుండు
చందురుఁడు దానిముఖసామ్య మందు టెట్లు?
బురదలోఁ బుట్టు నెత్తమ్మిపూవు లెట్లు
చెలియకందోయి పోలికఁ జెందఁగలవు? 17

ఆ కురులయంద మేమనవచ్చును!

శౌన:—కురులు గావు. మీవంటివారి మెడ కురులు. నీకిష్టము కుదిరి నది గనుక దానిని తెగవర్ణించుచున్నావు. ఇష్టమైనచో నల్లని

వన్ని యింద్రనీలమాణిక్యము లగును. ఆకుపచ్చని వన్నియు గారుత్మతము లగును. ఈ గొడవ లేనా, స్వర్గదండయాత్రమాటేమైన నున్నదా? శంబరుఁడు మహోత్సాహముతో, తల విఱియఁబోసికొని తిరిగి సేనలఁ గూర్చుచున్నాఁడు.

ఉపసుం:—నీసేనలు దొంగలుదోల! నీదండయాత్ర తగులుబడ. నాకెందుకు రా? మన్మథుఁడు తనసేనానాయకులైన వసంతమలయమారుతములతో, శుకపికాది సైన్యంబుఁ గూర్చుకొని నాపై దండువెడలినాఁడు. అతనిబారినుండి తప్పించుకొన్నప్పుడుగదా నేను వేల్పుపీటిపై దండువిడియుట?

గీ. అతివకూటమి నాకిప్పు డబ్బదేని,
నకట! త్రైలోక్య సామ్రాజ్యమైన నొల్ల,
కమలలోచన పొందులు గలిగె నేని
నేల త్రైలోక్య సామ్రాజ్య మింక నాకు. 18

శౌన:—సరే! రెండుపద్ధతులచేత నీకు స్వర్గసామ్రాజ్య మక్కఱలేదు. 'ఇతో భ్రష్ట స్తతో భ్రష్టః' అన్నట్లు నీకు దండయాత్ర చిక్కదు. దీనిపొందు చిక్కదు.

ఉపసుం:—చిక్కకేమి! అది నాకంబు విడిచి నన్ను వెదకుకొనుచు నిక్కడికి వచ్చినదికదా?

శౌన:—ఔను! నిన్నె వెదకుకొని వచ్చినది. నన్ను వెదకుకొనివచ్చినదేమో యని నే ననుకొనుచున్నాను. నీ యందముకన్న నా యందము తక్కువా? కాదంటె నామేను కొంచెము ముదుతెలుపడినది. వయసు గడిచినది. అప్పుడప్పుడు మీరు కొట్టిన చెంపకాయలచేతనైననేమి,ముసలితనముచేతనేమి పండ్లూడినవి.

ఉపసుం:—మూర్ఖుఁడా! నోరు మూయుము.

శౌన:—అయ్యో! అదిగో మనశంబరుఁడు వచ్చుచున్నాఁడు దండయాత్రను గూర్చి యడుగుటకుఁగాఁబోలు?

శంబరుఁడు:—(తనలో) ఆహా! సుందునియంతవాఁడు భోగముత్తొత్తు కూఁతురువలలోఁబడి విజయయాత్రోత్సాహము విడిచినప్పుడు, వానితమ్ముఁడుమాత్రము వేఱువిధముగా నుండునా? ఒకవేళ నితఁడు దుర్వ్యసనసక్తుఁడు గాకయున్నను దండయాత్ర తానొక్కఁడ నిర్వహింపఁగలఁడా? సరే! చూచెదఁగాక.

శౌన:—శంబరా! రా. రా. మంచిసమయమునకే వచ్చినావు.

శంబ:—దేవా! జయము. జయము.

ఉపసుం:—శంబరా! ఇప్పు డేలవచ్చితివి?

శంబ:—దండయాత్రావిషయము మీకు జ్ఞాపకముచేయుటకు.

ఉపసుం:—ఏమి! రాజకార్యములు విన్నవించుటకు సమయము లేదా? తగినస్థలము లేదా? ఈవేళ యావేళ యనక— యీనెల వానెల యనక— యర్ధరాత్రమునందు సపరాత్రమునందుఁ జెప్పవచ్చునా? కాలము గడచినవాఁడవు. లోకానుభవము గలవాఁడవు. బుద్ధి లేదా?

శౌన:—(తనలో) బుద్ధియున్న పక్షమున నీదగ్గఱ కొలువేచేయకపోవును.

శంబ:—దేవా! ఆగ్రహింపకుఁడు. మీయన్నగారికడకు నేను బోయి యీవార్త విన్నవించితిని. కాని యాయన తన కస్వస్థముగా నున్నదనియు, మీచేత దండయాత్ర నడపింపుమనియు సెల విచ్చుటంజేసి మీకడకు వచ్చితిని. స్వామిభక్తిప్రేరితుఁడనై వచ్చితినిగాని మీమనంబున కాయాసముఁ గలిగింప రాలేదు. తప్పున్న క్షమింపుఁడు.

ఉపసుం:—అట్లయిన నాకు నస్వస్థముగా నున్నది. దానవచక్రవర్తియైన సుందుఁడే యీ దండయాత్ర నడుపుఁగాక!

శౌన:—అందఱికి, తలోకరోగ మున్నది. ఈ శంబరునకు నాకు నేరోగము లేదు.

శంబ:—దేవా! ఆయన దండయాత్ర మిమ్మునడుపుమనియె. మీరాయ
నను నడుపుమనుచున్నారు ఇది దానవకులమునకు మహారిష్ట
హేతువని తలంచుచున్నాను. నేనొక-మనవిచేసెద. చిత్త
గింపుఁడు!

ఉ. ఈ సమయంబు దాఁటి చనునేని సుపర్వులు దైత్యకోటి ను
ద్వాసము జెప్పి పంపుదురు దైత్యకులేశ్వరులెల్ల నస్త్రస
న్న్యాసముజేసి శారదపులంబుఁ దపంబులు సేయుచున్న స
న్న్యాసుల బూనవచ్చు దితినందనులందఱు గాఢనిస్పృహాత్. 18

ఉపసుం:—మంచిది! మేలైనపని! రక్కసులందఱు యోగులు, మౌ
నులు, సన్న్యాసులునైనపక్షమున లోకములో మనకు
సుప్రతిష్ఠ గలుగును.

శౌన:—అందఱు సన్న్యాసులైనపక్షమున భిక్షలుసేయువారు లభిం
తురా? తలలు గొరుగుటకు మంగళ్లు దొరకుదురా?

శంబ:—దేవా! మీకు తిరస్కారముగా మాటలాడఁజనదు. నేను
కుండ పగులఁగొట్టిన ట్లున్నదున్నట్లు మాటాడుచున్నాను.
వినుఁడు! మీరు, మీయన్నగారు తిలోత్తమయను మత్తకాశిని
యందుఁ జిత్తంబునిలిపి పరాయత్తులై యుత్తాలంబగు నుత్తల
పాటునొంది మెత్తవడియున్నవారని నాకుం దోఁచుచున్నది.

ఉ. వీరరసప్రదర్శనపువేళగదా యిది? యిట్టివేళ శృం
గారరసప్రధానముగఁ గాలముఁబుచ్చుట పాడియౌనె? జం
భారి ముఖామరప్రవరులందఱు మిమ్ములను గేలిసేయరే,
శూరులు కాంతలన్మరఁగి సొక్కినఁ దక్కునె రాజ్యసంపదల్. 19

అదియటుండఁగా మీరిప్పుడు విషయాసక్తులరై, స్త్రీలోలురై
త్రిదశాలయదండయాత్రాపరాఙ్ముఖులైనపక్షమున జంభారాతి
ప్రముఖసుపర్వాణులు తమ దంభోళిప్రముఖాయుధంబులకుఁ

దమ ప్రతాపంబులకు వెఱచి దండయాత్ర మీ రుపసంహరిం చితి రని తలంతురు. వారే కారు—సకలలోకంబులు నట్లే తలం చును. ఇంతకన్న నప్రతిష్ట మన కేమున్నది? ఇప్పుడు నాకలోకము మీఁద దాడివెడలి దిక్పాలురజయించి త్రివిష్టపమాక్రమించి నిర్నిద్ర తేజస్సంపన్నులై, మహేంద్రులరై చింతామణీ భద్ర పీఠంబు నధిష్ఠించి, యటమీఁద విశ్రాంతిగైకొని నందనోద్యాన విహారంబులు, మందాకినీజలక్రీడలు, నప్సరాంగనాపరిరంభణం బులు, శృంగారరసప్రకటనములు, కావలసినన్ని చేయవచ్చును. ప్రస్తుతము వాటినన్నిటిని విరమించి దండయాత్ర నడుపుఁడు. దానవయోధులు మహోత్సాహసంభరితులై యుద్ధ మెప్పు డెప్పుడని మీయాజ్ఞకై నిరీక్షించుచున్నారు. ఈయుత్సాహము డిందెనేని వారిని రణంబునకు మరలఁ బురికొల్పుట కష్టము.

ఉపసుం:—ఓరోరి మూర్ఖుఁడా! మేము కార్యవ్యగ్రులముగాక భోగైక పరాయణులమై—స్త్రీలోలురమై—యున్నామని యధిక్షేపణలు చేయుచున్నవాఁడవు. పశువా! అధమాధముఁడవైన నిన్నొక పెద్దజేసి యమాత్యపదవియందుఁబ్రవేశపెట్టినందుకు మాయెడఁ గృతజ్ఞుఁడవుగాక, దోషాన్వేషణపరాయణుఁడవై యిచ్చకువచ్చి నట్లు ప్రేలఁజొచ్చితివి. అతిక్రాంతమర్యాదుఁడవై వదరుచున్న నిన్ను నేనీక్షణమె శిరఃకర్తన మాచరించి యమమందిరంబున కతిథిగా నంపియుందునుగాని, చిరకాలాశ్రితుఁడ వగుటచేతను వృద్ధుఁడ వగుటచేతను నిన్ను క్షమించితిని. నీమొగము జూడఁ గూడదు. పో పో. నాయెనుట నుండఁగూడదు పో పో.

(అని తన్నుచున్నాఁడు)

శౌన:—పోపోవయ్యా! త్వరగా పో. నిన్నాయన చంపెనా శవము నావల కీడ్వలేక నేను చావవలెను మధ్య.

శంబ:—ఆహా! చిరకాలము మిమ్ము సేవించినందుకు, మీక్షేమమే యరయుచున్నందుకుఁ దగిన బహుమానమే చేసితిరి. (తనలో) ఆహాహా! చంచలచిత్తులు, మదోన్మత్తులు, భోగాయత్తులు నైన రాజుల సేవించువారికిఁ బ్రాపించునర్గతు లిట్టివే కదా! ఇంతకు దానవుల భాగధేయములు మంచివికావు.

గీ. వానకారున మొలిచి యెంతేని పెరిఁగి
వేసవినిఁ జచ్చుపురుగులవిధము దోఁప
దానవులు కొన్నినాళ్లు వర్ధనము జెంది
నాశమొందుచునుంద్రు దుర్నయముచేత. 20

(అని నిష్క్రమించుచున్నాఁడు)

శౌన:—అమ్మయ్యా! ఈ యర్ధరాత్రమువేళ పీనుఁగును మోసెఁడు కష్టము తప్పినది

ఉపసుం:—ఎందుచేత నోరీ!

శౌన:—వీనినిక్కడ నీవుచంపుదువు. ఆపైన పీనుఁగును నావలఁ బాఱవేయుమని నన్నుఁ జంపుదువు.

ఉపసుం:—నీ కాకష్టము తప్పినదిగదా?

శౌన:—ఈ కష్టము తప్పఁగానే సరియా? ఇల్లలుకఁగానే పండుగయౌనదా? నాకన్నియుఁ గష్టములే.

ఉపసుం:—మిత్రుఁడా! నీకష్టముల కేమిగాని నాకష్టమునుండి నన్నుద్ధరింపుము.

శౌన:—మీకష్ట మిష్టమైనకష్టము. తిని కూర్చుండలేక యేదో యొక తొత్తుకూఁతురు దొంగనవ్వులు నవ్వుచురాఁగానే మీరు దానికి గులాములై సలాములుచేయుచుఁ గొరవితోఁ దలగోఁకికొను నట్లు విరహతాపమని పేరుపెట్టి యేదో లేనిపోనిబాధ తెచ్చి పెట్టుకొని 'యమ్మో నాయనో' యని మూలుగుచుందురు.

ఉపసుం:—శౌనకా! స్వతస్సిద్ధమైనదో తెచ్చిపెట్టుకొన్నదో యేదో కష్టముకలిగినది. తిలోత్తమ నామనోవీథిలో నిండుచెలువంబుతో నిలువంబడియున్నది.

ఆ. వె. కలికికొంగ్వు దలఁపఁ గామాంధకారంబు
కనులు గాననీక గాసి వెట్టు
మోము చందురుగన మోహపయోరాశి
పొంగి పొరలి నన్ను భంగపుచ్చు. 21

శౌన:—అందు కేమిచేయుమనెదవు?

ఉపసుం:—నీవు దానియొద్దకుఁబోయి,

సీ. కామాంధకారంబు ఖర్వమౌనట్టులు
చిఱునవ్వు వెన్నెలల్ చిలుకుమనుము
మోహపయోధిలో మునిఁగిపోవక యుండ
ననుకంపయను తేప ననుపు మనుము
విరహతాపంబుచే వెక్కసపడకుండ
చల్లనికౌఁగిట సాఁకుమనుము
అలరువిల్తుని హాళాహళిబారిఁ బడకుండ
కనికరంబునుజూపి కావుమనుము

తే. గీ. ధారుణీమండలంబెల్లఁ దనదె యనుము
ఏది గావలెనన్న నే నిత్తు ననుము
నన్నుఁబోలెడి సరసుండు నాస్తి యనుము
పలుకు లేటికి నేను సేవకుఁడ ననుము. 22

శౌన:—"అనుము"అని నాతో నీవుచెప్పితివి. "వినుము" అని దానితో నేను జెప్పెదను—'విన్నాను చనుము' అని యది యుత్తరము చెప్పును. ఈ నాటకమంతయు నేను సూత్రధారినై నడిపెదను.

ఉపసుం:—మిత్రుఁడా! నీవు వెళ్లి నీచమత్కారవచనములచేత దాని మనసుకరఁగించి నాయందనురాగమువొడముసట్లుచేయఁగలవు.

శౌన:—నన్నుబ్బవేయఁ బ్రయత్నింపకుము. ఎట్లయినను నేను పోయెదను లే. (అని యిద్దరు నిష్క్రమించుచున్నారు)

ఇది

తృతీయాంకము.



# తిలోత్తమ

## చతుర్థాంకము

### మొదటి రంగము

[ అంతట మంచముమీఁద పరున్న తిలోత్తమయు, ప్రక్కనకూర్చున్న మంజుఘోషయు ప్రవేశించుచున్నారు ]

మంజు:—సుందుఁ డేమిచేయుచుండునని నీవనుకొనక్కఱలేదు! మోహ పరవశుఁడై తహతహం బడుచుండును.

తిలో:—అది నీయూహయా నిజమా?

మంజు:—ఊహయేకాని, నాయూహ సరియైనదే. నిన్ను జూచిన తరువాత వానివైఖరి మారినది.

తిలో:—ఉపసుందుఁ డెట్లున్నాఁడో?

మంజు:—అతఁడుకూడ నీలావణ్యసముద్రములో మునిఁగి తేలుచున్నాడును.

తిలో:—అన్నదమ్ములకు మాత్సర్యము కలుగునా?

మంజు:—తప్పక కలుగును. మహేంద్రుని మనోరథము సిద్ధించును.

తిలో:—నీనోటివాక్యమున నాకు మాటదక్కవలెగద.

మంజు:—ఎవరో వచ్చుచున్నారు. జంబుకుఁడు కాడుగద.

[ అంతట జంబుకుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

జంబు:—(తనలో) సుందోపసుందులకు వినాశకాలము సమీపించి నట్లున్నది. ఈ తోత్తుకూఁతును జూచినది మొదలుకొని, అన్న

దమ్ములకు వెట్టి ఎత్తినది. ఈ రాయబారపుమూటలు మోయ
లేక నేను చచ్చిపోవుచున్నాను. (ప్రకాశముగ) తిలోత్తమా!
నీకు శుభమగుఁగాక!

తిలో:—జంబుకా! కూర్చుండుము.

మంజు:—రాత్రివేళ నీవేల వచ్చితివి? మీమహారాజుగారేమైన సందేశ
మంపిరా?

జంబు:—నాకేమిపనియున్నది? సందేశములు మోసుకొనివచ్చుటే!

మంజు:—మీమహారాజుగారెట్లున్నారు?

జంబు:—ఎట్లున్నారని చెప్పను. కడుపునొప్పిచేత నేలమీఁద పొరలు
చుండు దున్నపోతువలె నేమి తోఁచక యీమెను గురించి
విరహతాపపడుచు మంచముమీఁద దొర్లుచున్నారు.

మంజు:—నీవు వానిని ఓదార్పలేకపోతివా!

జంబు:—తార్పువల్ల నేగాని, యోదార్పువలన వానిబాధ శమింపదు.

మంజు:—ఇప్పుడు నీసందేశమేమి?

జంబు:—మహారాజుగారీమెను జూడవత్తురు. రావచ్చునా యని
యడుగుమన్నారు.

తిలో:—సిరిరా మోకాలొడ్డు మూర్ఖులుందురా? వారిక్కడికి దయ
చేయుట మమ్మనుగ్రహించుటయే.

మంజు:—స్వాగతమని జెప్పుము.

జంబు:—అట్లైన నిప్పుడే పోయి వానిని దోడ్కొని వచ్చెదను.
(అని నిష్క్రమించును)

మంజు:—నేను జెప్పలేదుటే, వాఁడిప్పుడు మన్మథపిశాచముచేత
ఆవిష్టుఁడై యుండునని.

తిలో:—నీయూహ సరియైనట్లే తోఁచుచున్నది.

మంజు:—మహేంద్రుఁడు వజ్రాయుధము విడిచి నీ లావణ్యాశస్త్రము

చేతనే పగతురను బరిమార్పఁదలఁచుకొన్నాఁడు. కామదేవుఁడు ముందుగా చిగురుకైదువుతో వానిహృదయమును చించియుండును. ఆగాయమునుండి వానిధైర్యసారము కారిపోయి యుండును. కావుననే బేలయై వాఁ డిప్పుడు నీకడకు రాదలఁచుకొన్నాఁడు.

తిలో:—రానీ ఎట్లు పరిణమించునో చూతము.

[ అప్పుడు సుందుఁడు, జంబుకుఁడు ప్రవేశించుచున్నారు ]

సుంను:—జంబుకా! నీసందేశమును శ్రద్ధతో విని నన్ను రమ్మనుటచే నిజముగ నాపై నామె వలపు నిలపిన దన్నమాటే.

జంబు:—ఇంతమాత్రముచే వలచిన దని ఎట్లు చెప్పఁగలము మీరు రాదలఁచుకొన్నప్పుడు వద్దనునా! బోగముముండకు వల పుండునా?

సుందు:—మూర్ఖుఁడా! ఇష్టమువచ్చినట్లు ప్రేఁకు. కార్యభంగమగును. మనము ముందుగ యీగోడచాటుననుండి యీమె స్థితి యెట్లున్నదో కనిపెట్టుదము ముందుగ నెగఁటపడవద్దు.

జంబు:—నిజముగ నీకు శని పట్టినదయ్యా! లేనిచో మేడలు మిద్దెలు విడచి గోడలలోను గొందెలలోను కూర్చుందువా?

సుందు:—శనికాదు, అదృష్టము పట్టినదనుము.

(అని యిరువురు గోడచాటున నిలిచియున్నారు)

మంజు:—తిలోత్తమా! వారు వచ్చినట్లున్నది.

తిలో:—అట్లైన లోనికి రాలేదేమి?

మంజు:—ఏగోడచాటుననో పొంచియుండి మన సంభాషణలు విన దలఁచినారేమో! ఇఁక మన మాడఁదలఁచిన నాటక మారంభింతము.

తిలో:—ఈ నాటకమునకు నీవే సూత్రధారివి.

మంజు:—సఖీ తిలోత్తమా! నిద్రపోవు. ఉదయమునుండియు ఆహారము పుచ్చుకొనవు. నీకు పిశాచముపట్టినదా? వెఱ్ఱియెత్తినదా?

తిలో:—కామపిశాచము పట్టినది.

మంజు:—ఏమిచికిత్స చేయవలెనో నేనెఱుఁగను.

తిలో:—ఈ పిశాచమును వదలించు మహామాంత్రికుఁడు సుందమహారాజు. ఆయనను తోడ్కొనిరమ్ము. ఆయన నన్ను గాఢాలింగనము చేసుకొన్నపక్షమున, కాముఁడు నిలువలేక పారిపోవును.

సుంద:—జంబుకా! విన్నావా? ధన్యోస్మి. ధన్యోస్మి. భోగము ముందుకు వలపుండునా యంటివి!

జంబు:—విన్నాను. నాకు చెప్పుడులేదు. ఇది వలపుకాదు. నిన్ను పడవేయు వల.

సుంద:—ఉండు. ఉండు. మాటాడకు. వారి సంభాషణ విందము.

మంజు:—ఇదియేమే నీచరిత్రము విచిత్రముగ నున్నది.

సీ. జనవిరుద్ధముగాదె చలువలు వెదజల్లు
మంచిగంధపుపూఁత మంటయనుట
హాస్యాస్పదముగాదె యానందకరమైన
కలువపూవులకచ్చు కాకయనుట
మిగుల చిత్రముగాదె మెత్తమెత్తగ నుండు
విరులపానుపు కడు వెట్టయనుట
నగుఁబాటుగాదటే నలుగురిలోపల
దక్షిణవాయువుల్ తాపమనుట

గీ. విరహతాపము బడినట్టి వెలఁదుకలను
మున్నెఱుంగనుగాని యీవన్నెదాని
కనివిని యెఱుంగనెపుడు స్వర్గంబునందు
మర్త్యపాతాళములయందు మధురవాణి.

తిలో:—నీకు హాస్యాస్పదముగ నుండవచ్చును. కాని నేపడెడి వేదన నీవే మెఱుఁగుదువు. ప్రసవవేదన గొడ్డురాలెఱుఁగునా? అరసికురాలికి విరహతాప మెట్లు తెలియును?

మంజు:—నాకు తెలియదనక్క-అదిలేదు. ఈబాధ పగవారికైన వద్దు. ఇప్పు డేమిచేయమందువు. బాధపడువారినిజూచి సహించుట యాప్తులకు మిక్కిలి కష్టముగదా!

తిలో:—

మ. అతివా! సుందుఁడె నామనోహరుఁడు నాకాంతుండె ప్రాణంబు నా
కతఁడే స్వర్గ మతండె మోక్ష మతఁడే యానందసంధాయకుం
డతఁడే వేలుపు పెన్నిధానము మదీయంబైన భాగ్యంబు నా
బ్రతికింపన్ దలపోయుదేని యతనిన్ బ్రార్థించి రప్పింపుమా! 2

సుందు:—మూర్ఖుఁడా! నీకిప్పుడు తెలిసినదా! నాకొఱకై యామె ఎంత వలవంతఁ జెందుచున్నదో!

జంబు:—భోగముదాని వంతలు, వలవంతలు నమ్మి బలవంతులెందరో మేనుమరచి గంతులువైచి నశించిరి.

సుందు:—నీపాడునోటికి బుద్ధిచెప్పుకో! లేనిచో బుద్ధిచెప్పెద.

జంబు:—ఈ సమయమున నేనూరకుండరాదు. నాయుపేక్ష యామె తాపమున కింధనమగును. ఎదుటఁబడి యామె నోదార్చుట మంచిది. ( అని తిలోత్తమ కడకు పోవుచున్నాఁడు )

మంజు:—తిలోత్తమా! నీవు సంకల్పసిద్ధురాలవమ్మ.

తిలో:—ఎట్లు?

మంజు:—అదుగో! సుందమహారాజుగారే నీదర్శనార్థమై విజయము చేసినారు.

తిలో:—ఆహా! భాగ్యము. జయము జయము మహారాజా!

(అని లేవఁబోవుచున్నది)

మంజు:—లేవకమ్మా! నీవు పడిపోదువు.

సుందు:—కల్యాణీ! నీవస్వస్థురాలవై యున్నావు. లేవఁగూడదు. లేచుటకన్న పండుకొనియుండుటే మమ్ము గౌరవించుట. నీకింత యాయాసము కలిగించిన పాపకర్ముని నన్ను క్షమింపుము.

మంజు:—స్వామీ! మీరేమిచేసిరి క్షమించుటకు?

తిలో:—దేవరవారు అంతమాట సెలవీయవలదు. నేనా క్షమించెడి దానను.

జంబు:—రమించుదానవు నీవే! క్షమించుదానవు నీవే!

సుందు:—నీవే క్షమింపవలసినదానవు ఏలయన—

గీ. నానిమిత్తమె నీకింత నలతగలిగె
నన్నుగురియించియే నీవు నవసిపోతి
పతికఠినుఁడనె నైతి నీయంతరంగ
మెఱుఁగఁజాలక మెలఁగితి నీవిధమున. 3

మంజు:—దేవా! మీపేరుదప్ప మఱియొకనామము వినదు. మీకథ తప్ప మఱియొక్కచరిత మాలకింపదు. మీరూపమే నిరంతరము ధ్యానించుచుండును. నిద్దురలో మీపేరే పలవరించును. మీ చిత్తరువు వ్రాసి తనయెదుట పెట్టుమని నన్ను కోరుచున్నది.

సుందు:—అంత ప్రణయముగల నిన్ను నేననాదరణచేయుట నాదితప్పే!

జంబు:—ఈతప్పునకు తగిన దండనముచేయుట మంచిది.

సుందు:—నిజమే అట్లు చేయఁదగును.

తే. గీ. తలిరుఁబోఁడి నీబాహుమధ్య మను నట్టి
విపుల కారాగృహమున నఱబెట్టి యచట
నింక నెన్నఁడుసేయకు మిట్టులనుచు
నకుఁ—నను జేర్చి గట్టిగా నొక్కఁదగును. 4

తిలో:—(సిగ్గున తలవంచును)

జంబు:—నేరమునకు తగినశిక్ష. అట్లే చేయుము.

మంజు:—సుకుమారులగు మహారాజుగారు యిట్టి కఠినశిక్ష యెట్లనుభ వింతురో గదా!

జంబు:—అనుభవింపవలసివచ్చినప్పుడు అనుభవింపక తప్పునా?

సుందు:—కల్యాణీ!

తే. గీ. ఇంతయలమట నాకయి యేలపొంద
నీవిధేయుఁడ, దాసుఁడ, నీకుఁబాట
వ్రాలకుందునె నీపాదపద్మముకడ
నబల వార్త నొక్కించుక నంపియున్న. 5

తిలో:—ప్రాణేశ్వరా! ఎంత వేశ్యయైనను వనిత స్వయముగ వలచి వార్త లంపిన లోకువగాదా?

మంజు:—స్త్రీల చిత్తవృత్తులు పురుషుల కజేయములు.

జంబు:—(తనలో) ఈటక్కులమారికి ఇతడప్పుడే ప్రాణేశ్వరుఁడై నాఁడు.

సుందు:—హృదయేశ్వరీ! లోకువగుట యితరకాంతల విషయముగాని నీవిషయమున గాదు.

జంబు:—ఆయన ప్రాణేశ్వరుఁడై నాఁడు, యీయమ హృదయేశ్వరి యైనది. ఇఁక అంతఃపురప్రవేశమే తరువాయి

మంజు:—మీరిద్దరు నెచ్చటనున్న యదే యంతఃపురము.

సుందు:—సుందరీ! మనము నాయంతఃపురమునకు పోవుదమురమ్ము.

మంజు:—మీపట్టపుదేవిమాటయేమిటి? ఆమె ఈమెరాక సహించునా?

జంబు:—సవతిపోరు! కావలసినంత సందడి.

సుందు:—తిలోత్తమా!

గీ. నీవె పట్టపుదేవివి నీవె రాణి
వందరును ధరియింత్రు నీయాజ్ఞ తలల
నూడిగంబుల్ల జేయింతు నువిదనీకు
సిద్ధ యక్ష విద్యాధర స్త్రీలచేత. 6

తిలో:—దేవరవారు తలుచుకొన్న నేపని జరుగను!

మంజు:—త్రిలోకాధినాథులగు మీకు అసాధ్యమున్నదా?

జంబు:—రాజు దలంచిన దెబ్బలకు కొదువా?

తిలో:—ప్రాణేశ్వరా! మీయంతఃపురప్రవేశము రేపు సాయంకాలము చేసెద.

జంబు:—నేఁడు వర్జమున్నదా! తారాబల చంద్రబలములు కుదుర లేదా? శుభస్య శీఘ్రమ మన్నారు. నేఁడే మంచిదేమో!

మంజు:—నేఁ డీమె యలసి సొలసి యున్నది. రేపుచేయుటే మంచిది.

తిలో:—మహారాజా! నాదొకవిన్నపమున్నది. మన్నించిన విన్నవించెద.

సుంద:—దేవీ! ఆజ్ఞాపింపుము. భయములేదు.

మంజు:—భయపడక చెప్పవమ్మా!

తిలో:—మీతమ్ముఁడుగారు కూడ నామీఁద కన్నువేసిరని కర్ణాకర్ణిగ వినియుంటిని. అందువలన నేమిప్రమాదము మూఁడునో యని భయపడుచున్నాను.

సుంద:—భయము నీకా నాకా! నేనుండఁగా నీకు భయములేదు. వాఁడు నాతమ్ముఁడు. విధేయుఁడు. నేను నిన్నుఁగోరినట్లు విన్న యెడల వాఁ డాయుద్యమమునుండి విరమించును.

తిలో:—విరమింపనిచో—

సుంద:—బుద్ధిచెప్పి విరమింపఁజేసెదను.

జంబు:—అంటించినదిరా కొంప! పలుగుముండ!

మంజు:—సింహము నాశ్రయించిన జంతువునకు అన్యమృగములవలన భయ ముండునా?

సుంద:—దేవీ! వినుము. నాప్రతిజ్ఞ—

గీ. నీవు నాదేవివైతివి నీరజాక్షి
నిన్ను పరుఁ డపేక్షించిన నెనరులేక

యనుజుఁడైనను వాఁడొక్క దనుజుఁడైన
పంచశరునకు బలియిత్తు పట్టివాని.

మంజు:—భళీ! దానవేంద్రా! భళీ!

తిలో:—ఇప్పటికి నాయలమట దీరినది.

జంబు:—(తనలో) దానవేంద్రులకు దినములు దగ్గరపడినవి.

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

## రెండవ రంగము

[ అంతట మంచముమీఁద పండుకొని తిలోత్తమయు, ప్రక్కన మంజుఘోషయు ప్రవేశించుచున్నారు ]

మంజు:—సఖి! నాటకప్రయోగము అందముగనే జరిగినది. అన్నదమ్ములకు వైరబీజము మెల్లగ నాటినావు. అది మహావృక్షమై ఫలించుఁగాక! రేపు సాయంకాలము వాని యంతఃపురి ప్రవేశింతునని చెప్పితివేల?

తిలో:—రేపు సాయంకాలములోపల వాని కంతము గలుగునని నేను విశ్వసించుచున్నాను. వాని యుత్సాహముజూడఁగ సోదరునైనను వాఁడు వధించునట్లు తోఁచుచున్నది.

[ అంతట శౌనకుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

శౌన:—(తనలో) ఉపసుందునకు మతియే లేదు. ఈ తొత్తుకూఁతురు వానికొంప తీసినది. ఈ యవస్థనుండి తప్పించుకొను దారి గనపడదు. (అని ముందుకు నడచుచున్నాఁడు)

మంజు:—ఎవరా వచ్చువారు?

శౌన:—నేను శౌనకుఁడను. ఉపసుందుని సేవకుఁడను.

తిలో:—ఉపసుందమహారాజుగారు కుశలమా?

శౌన:—ఏమికుశలము! నీయనుగ్రహ మున్నపక్షమున కుశలము గలుగును. లేనిచో లేదు.

తిలో:—నాయనుగ్రహ మెందులకు!

మంజు:—ప్రభువులు వారు. వారి యనుగ్రహమే మాకు గావలెను.

శౌన:—నీ యనుగ్రహము సంపాదించుటకు ఆయన యిచ్చటకు రాదలఁచినాఁడు. రావచ్చునా?

మంజు:—తప్పక రావచ్చును.

తిలో:—కనకవర్షము కురియుచుండఁగ వద్దను మూర్ఖు లుందురా?

శౌన:—అట్లైన నేనిప్పుడే ఆయనను తోడ్కొనివచ్చెదను.

(శౌనకుఁడు నిష్క్రమించును)

మంజు:—చెలీ! అన్నదమ్ములిద్దఱు నీయింటి కుక్కలైనారు!

తిలో:—మనలను కఱవరుగద!

మంజు:—కుక్క కాటుకు చెప్పుదెబ్బ లేదా?

తిలో:—ఒక్క మాంసపుముక్కకై పోట్లాడి కుక్కలు ఒండొంటిని కఱచుకొనునట్లు వీరు పరస్పరనాశనము చేసుకొందురు.

మంజు:—ఆపని చేయుటకే గదా మనము వచ్చితిమి!

తిలో:—దేవతల సంకల్పము నెఱవేఱుఁగాక!!

[ అంతట ఉపసుందుఁడు, శౌనకుఁడు ప్రవేశించుచున్నారు ]

మంజు:—అదే! వారు వచ్చుచున్నట్లున్నారు. కలాపము ప్రారంభింపవచ్చును.

తిలో:—చెలీ! ఆయన యింకను రాలేదేమే! ఉపసుందునిజూడక నేను క్షణమైన నిలువజాల.

ఉపసుం:—శౌనకా! క్షణకాల మీచెట్టుక్రింద నిలిచి వారి సంభాషణము విందము. నిలువుము. (ఇరువురు చెట్టుక్రిందనిలుచుందురు)

తిలో:—చెలీ! పలుకవేమే?—

కం. ఉపసుందుని సుద్దులె నా
కుపదేశింపు మిట వాని యురుభుజబలమే
చెపుమా వాని గుణంబులె
కృపతో నెఱిఁగింపు మన్యమేటికి నాకున్. 8

మంజు:—ఇదివరకు చెప్పుచుంటిని కాదా! ఎన్నిమాఱులు చెప్పను.

ఉపసుం:—శౌనకా! వినపడుచున్నవా వారి మాటలు.

శౌన:—వినపడ కేమి! వద్దన్నను చెవులలోఁ బడుచున్నవి.

మంజు:—దివ్యసుందరవిగ్రహులైన దేవతలుండఁగ సిద్ధ, కిన్నర, కింపురుషాదు లెందరోయుండఁగ, ఉపసుందుని వలచితివి. అతఁ డేమంత అందగాఁ డమ్మా?

ఉపసుం:—ఆసి ముండ! నన్ను నిందించి ఆమెకు నామీఁద ప్రేమ లేకుండ జేయఁదలఁచుకొన్నావా? దీని నాలుక కోసివేయవలెను.

శౌన:—తొందరపడి చేతులార కార్యభంగము చేసుకొనక ఆమె ఏమి చెప్పునో వినుము!

తిలో:—ఏమే, ఆతఁ డేమంతయందగాఁ డనుచున్నావా!

తే. గీ. అతని యందము కలదె జయంతునందు
నల్ల నలకూబరుని యందు నతనునందు
పొగడతరమె ఎవ్వరికైన భుజబలంబు
వాని పేరు విన్న జగము వడఁకిపోవు. 9

మంజు:—సుందుఁడుమాత్రము పరాక్రమవంతుఁడు కాఁడా?

తిలో:—కావచ్చునుగాని, యితఁడు నామనస్సు హరించినాఁడు.

ఉపసుం:—భళి! తిలోత్తమా! భళి. శౌనకా! నాయదృష్టము ఫలించినది.

శౌన:—కాదు. దేవతల యదృష్టము ఫలించినది. ఏలయన దండయాత్ర యాగిపోయినది.

ఉపసుం:—మనమీఁదికి వచ్చిన మన్మథదండయాత్ర నివారించుకొని యామీఁదట సురలపై దండయాత్రకు వెడలుదము. మన మీపాటికి వారియెదుటకు పోవుదమురమ్ము.

శౌన:—చిత్తము. (ఇద్దఱు లోపలకు పోవుచున్నారు)

మంజు:—(లేచి) దానవసార్వభౌమునకు స్వాగతము. తిలోత్తమా! నీవు లేవకు పడిపోవుదువు.

ఉపసుం:—కల్యాణీ! తిలోత్తమా! నీదేహము మిక్కిలి కృశించి యున్నది. నీవు పండుకొనియుండుటయే మా కుపచారము.

శౌన:—పడిపోకుండ కౌఁగిలించి గట్టిగ పట్టుకొనుము.

మంజు:—ఆయదృష్టముకొఱకే మా చెలి యెదురుచూచుచున్నది.

ఉపసుం:—అంతభాగ్యము నాకెప్పుడు కలుగునా యని యువ్విళ్లూరు చున్నాను.

మంజు:—దేవా! మీవిరహము సహింపలేక ఈమె యెంతెంతో తహ తహ పడుచున్నది.

సీ. పన్నుండుటకు పూలపాన్పు లమర్పగ
రాలపాన్పు లటంచు రవ్వసేయు
పన్నీటఁ దోఁగుట మున్నీటఁ దోఁగుట
గా నెంచి ఎంతేని గాసిపడును
అప్పులుచల్లిన నిప్పులుజల్లెద
విదియేమె యంచు నన్నీ సడించు
తాపంబుహరియింప తమ్మితూఁడులుదేర
పాములఁగన్నట్లు భయముపడును

గీ. యమరకాంతలు విరహంబునందుట ముందు
జూచియుంటినిగాని యేజూచిఎఱుఁగ
నింతతాపంబు నిటువంటి వింతవిరహ
మెందు నుపసుంద ప్రతికింపు మీరుమెకరుణ. 10

ఉపసుం:—అయ్యో యయ్యో! నాకొఱకీమె యింత ఆయాసపడుచున్నదా! నేను మరాత్ముఁడను. (అని తిలోత్తమ పాదములపైఁ బడి) కల్యాణీ! నన్ను క్షమింపుము. నన్నేమిచేయమందువు?

సీ. అలఁదుకునో మేన పలుచని గందంబు
కమ్మని కస్తూరి కలిపియందు
వీచుకునో వట్టివేళ్ల వీవనతోడ
పన్నీటిలో దానినున్నతడిపి
వ్రాయుకునో గండఫలకంబులందున
మకరికాపత్రముల్ మనమెలర్ప
కూర్చుకునో నవ్య కుసుమ దామంబులు
చెలువొప్ప నీకంఠసీమయందు

తే. గీ. మెత్తని చిగుళ్లకన్నను మృదువులైన
యడుగుదమ్ముల నొత్తుకునో నేనను వెరింగి
నావలన నీకు నిపుడేమి కావలయునో
యట్టి పనులెల్ల నన్ను సేయంగఁ బనుపు 11

శౌన:—(తనలో) త్రాగుమన్న నామెకాళ్లు కడిగి యానీళ్లు దాహము త్రాగును. కాముకు లేమిచేయరు!

మంజు:—మహారాజా! ఆయుపచారములన్నియు మేమే చేసితిమి!

తిలో:—ప్రాణేశ్వరా! అంతపని మీరు చేయతగునా?

ఉపసుం:—అట్లైన యిప్పుడు నేనేమిచేయవలయునో యాజ్ఞాపింపుము.

మంజు:—ఈమె మనసులో నొకపెద్ద బెంగగలదు.

ఉపసుం:—బెంగా! దానికి కారణము! తక్షణము చెప్పుము. వెంటనే నివారించెదను.

మంజు:—(తిలోత్తమ మొగము చూచుచున్నది)

తిలో:—సంశయింపక మహారాజుగారికి విన్నవింపవే! వారి కన్న నా యలమటఁ దీర్పువా రెవరే!

శౌన:—(తనలో) ఈ ముండలు ఏదో పన్నుగడ పన్నినారు.

ఉపసుం:—మంజుఘోషా! చెప్పు. చెప్పు. ఆలస్యము చేయకు.

మంజు:—మనవి చేయుచున్నాను. క్షమింపుఁడు. మీయన్నగారుకూడ నీమెపై మనసు నిలిపినారు. ఇంతకుముందే వారు వచ్చి యీమెనుజూచి తన్ను వరింపుమని ప్రార్థించిరి.

ఉపసుం:—అందు కీమె ఏమి బదులు చెప్పినది?

మంజు:—రాక్షసేశ్వరునకు భయపడి ఏమియు చెప్పక యూరకున్నది.

శౌన:—ఊరకుండుట సగమంగీకరించుటేగదా!

ఉపసుం:—భయముచేత యూరకున్నదని యామె చెప్పుటలేదా? ఈమె యభిప్రాయ మెట్లున్నది?

మంజు:—సంపెంగపువ్వునకు తుమ్మెదపై నెంత ప్రేమగలదో నీమె కాయనమీఁద యంతేప్రేమగలదు. ఇనుముమీఁదికి సూదంటు రాయి పోయినట్లు యీమెమనస్సు మీమీఁదకే పోవుచున్నది.

తే. గీ. అత్యగాధమౌ నీవిరహాంబురాశి
దేవ! నీబాహుయుగమను తెప్పచేత
ఈఁది దాఁటఁ దలంచిన దీ లతాంగి
కనికరించి యీయెలనాఁగ కావుమయ్య. 12

శౌన:—తెప్ప సిద్ధముగనే యున్నది.

ఉపసుం:—కల్యాణీ! బెంగవలదు. భయపడవలదు.

తే. గీ. బహురసజ్ఞుఁడు సుందుఁడు పద్మనయన!
నీవు నామీఁద చిత్తంబు నిలిపితన్న
మాట వినెనేని వెనుకకు మఱలిపోవు
కమ్మ సంపంగి గనిన భృంగంబువోలె. 13

శౌన:—ఈకన్నుల కీ తెప్పలు దూరములుకావు.

తిలో:—మీకున్న ధైర్యము నాకు లేదు.

మంజు:—ఎట్లైన మీారప్రమత్తులరై వర్తింపవలయు.

ఉపసుం:—ఇందు భీతికి కారణములేదు. భయమున్న యిప్పుడే నీవు నాయంతఃపురికి రమ్ము.

తిలో:—రేపురాత్రి మీాయంతఃపురి ప్రవేశించెద.

మంజు:—(తనలో) మీాయన్నదమ్ములు కాలాంతఃపురి ప్రవేశించిన తరువాత!

ఉపసుం:—

తే. గీ. నాదు కంఠంబునందు ప్రాణంబులుండ
సుందుఁడైనను లేక యా స్కందుఁడైన
తేఱి చూడంగఁజాలఁడు దేవి నీకు
వజ్రపంజరముసుమి మద్బాహుయుగము. 14

తిలో:—భళి! మహారాజా! భళి. బ్రతికిపోయితిని.

ఉపసుం:—రేపు సాయంకాలమువఱకు నే నీప్రాణము లెట్లు నిలుపుదునో తెలియకున్నాను.

మంజు:—ఈమెను నేనెట్లు కాపాడఁగలనో తెలియదు.

శౌన:—నన్ను కాపాడువారు ఎవరును లేరు!

ఉపసుం:—కల్యాణీ! సుఖముగ విశ్రమింపుము.

(అందరు నిష్క్రమింతురు)

ఇది

చతుర్థాంకము.



# తిలోత్తమ

## పంచమాంకము

### మొదటి రంగము

[ పీఠముమీఁద కూర్చుండి సుందుఁడును, ప్రక్కను నిల్చి జంబుకుండును ప్రవేశించుచున్నారు ]

సుందు:—జంబుకా! చెప్పు! చెప్పు! ఉపసుందుఁ డెట్లున్నాఁడో?

జంబు:—ఏమిచెప్పుదును స్వామీ! బురదలో దిగఁబడిన దున్నపోతు వలె నాయన తిలోత్తమా మోహమునం దగిలి బయటఁ బడ లేక యున్నాఁడు.

సుందు:—తిలోత్తమ తనమీఁద వలపునిలుపలేదే. ఆమె నన్నే వలచి నట్లు నానిమిత్తము పరితాపపడుచున్నట్లు మనముస్వయముగాఁ జూచితిమి కదా!

జంబు:—ఆమాయలమారి వాని కేమి యాశలు గొలిపినదో మన మేమెఱుఁగుదుము?

సుందు:—మూర్ఖుఁడా! తిలోత్తమ మిక్కిలి యుత్తమశీలము గలది. మనదగ్గఱ నొకమాట వానిదగ్గఱ నొకమాట చెప్పునట్టి మోస కత్తె కాదు.

జంబు:—ఆహాహా! ఆమెయెడ మీ కెంత విశ్వాస మున్నదండీ! వంచ నము లోకములో వేశ్యారూపమున నవతరించిన దని పెద్దలు చెప్పుటలేదా? మిమ్ము వలచినయెడల మీయంతఃపురి కేల రాలేదు?

సుంద:—ఉపసుందుఁడు కోపించునని.

జంబు:—అతఁడు కోపించిన నేమి?

సుంద:—మా యిరువురకు వివాదము కల్పింపకుండ మెలఁగి నన్ను జేపట్టవలె నట.

జంబు:—మీ రీవిధముగా వ్యవహారములు మాని రాజ్యము విడచి వేఁటకాని వలలోఁ జిక్కిన మృగమువలె దానివలలోఁ జిక్కియుండుటచే శంబరాది మంత్రులు దానవవంశమున కేదో కీడు మూఁడుచున్న దని భయపడుచున్నారు.

సుంద:—శంబరుఁడు నీవంటి మూర్ఖుఁడే నాకా! భయము!

తే. రాసులై చుక్క లవనిపై రాలుఁగాక
శైలములు సంద్రములమీఁదఁ దేలుఁగాక
పిడుగుఁగాక భాస్కరుఁ డిల పడమటిదెస
భయము కలుగునె సుందుని ప్రాణములకు. 1

జంబు:—మీధైర్యము కవివెట్టియే హరి యేదోరూపముగా నవతరించి హాని చేయఁగలఁడు.

సుంద:—చాలు చాలు నీవాగుఁడు కట్టిపెట్టు.

తే. మాదనుజుల బారికి నోడి మాధవుండు
మాఱువేసముల్ దాలిచి మహిఁజరించి
ప్రాణములఁ గాచుకొనఁ జూచె పాడుమనలు
వాని నవతారము లటంచుఁ బ్రస్తుతింత్రు. 2

జంబు:—అవతారములను మీరు చక్కగా సమర్థించినారు. స్వామీ! రంభాదులైన యప్సరలు పెక్కండ్రు గలుగ మీ రీ మాయల మారి వలపుగోతిలోఁ బడినా రేమి?

సుంద:—ఓరీ! వెఱ్ఱికుంకా! పలువురు నమలి పారవైచిన చెఱకుపిప్పి రంభ. ఊర్వశి రసములేని మామిడిటెంక. మేనక గాలిమెల్లఁ

బోయిన తిత్తి. తక్కిన యప్సరలు మన్మథుఁడు కాపురముండి లేచిపోయిన పాడుకొంపలు. వా రందఱు తిలోత్తమ కాలి గోటికైన సరిరారు.

జంబు:—ఈ విషయమున నుపసుందునకు మీకు ద్వేషముకలుగకుండ మెలఁగుడు.

సుందు:—నే నామెను జేపట్టఁ దలఁచినపుడు వాఁడు తనప్రయత్నము మానుకొనును.

జంబు:—మీరే పూనిక మానుకొందు రని యతఁడు తలఁచుచున్నా డేమో.

సుంద:—అట్లైన నీవిషయము 'ఇదమిద్ధ' మని తేల్చుకొనవలసినదే. మన మాతనికడకుఁ బోయి స్వయముగా మాటలాడుదము రమ్ము. (నిష్క్రమింతురు)

---

## రెండవరంగము

[ పీఠముమీఁదఁ గూర్చుండి ఉపసుందుఁడును, ప్రక్కను నిలిచి శౌనకుఁడును ప్రవేశింతురు ]

ఉపసుం:—శౌనకా! సుందుఁడుకూడ తిలోత్తమమీఁద వలపు నిలిపినాఁడా?

శౌన:—సందేహమేమి? అతఁడు కడుపునొప్పిచే బాధపడు నాఁబోతువలె పాన్పుమీఁద దొర్లుచున్నాఁడట. ఈమాట నాకు జంబుకుఁడు చెప్పినాఁడు.

ఉపసుం:—ఎందుకు దొర్లుచున్నాఁడు?

శౌన:—విరహతాపముచేత!

ఉపసుం:—అట్లైన నిది గొప్ప దురవస్థ.
శౌన:—ఈవార్త విని మణిమతీదేవి చాల ఖేదపడి మీతో నొకసారి మాటలాడఁ దలఁచుకొన్నది. ఒకసారి యంతఃపురికి దయ చేయుఁడు.
ఉపసుం:—ఎవ రా మణిమతీదేవి?
శౌన:—దేవరవారి పట్టమహిషి.
ఉపసుం:—ఆమె నామహిషి కాదు. తిలోత్తమయే నా పట్టమహిషి.
శౌన:—ఎందుచేత? తినఁగ తినఁగ గారెలు చేఁదైనవట.
ఉపసుం:—మణిమతీదేవి యను పేరు నాభార్యకు సార్థకము కాదు. నేతిబీరకాయలో నెయ్యి లేనట్లే యామణిమతిదగ్గఱ మణులు లేవు.
శౌన:—అమూల్యము లగు మణిభూషణము లుండఁగ మణులు లేక పోవుట యేమి?
ఉపసుం:—ఆమణులు మణులుకావు. తిలోత్తమయే మణిమతి. ఆమె కడ ననేకమణులు కలవు. ఏలనన—

తే. నిక్కముగ నామె కురు లింద్రనీలమణులు
దాని దంతాలబారు ముత్యాలచేరు
దానికెమ్మోవి పగడంబు గాన సఖుఁడ!
యామె సకలరత్నములకు నాకరంబు. 3

శౌన:—క్రొత్తవింత! ప్రాఁతరోత! యనుమాట నిజము.
ఉపసుం:—శౌనకా! అన్నయ్యనోడఁబఱచి యామెను నేఁ జేకొను టెట్లు?
శౌన:—మిమ్మోడఁబఱచి యామె నాయన చేకొనఁజూచుచున్నాఁడు.

[ అపుడు జంబుకుఁడును, సుందుఁడును ప్రవేశించుచున్నారు ]

ఉపసుం:—ఇది గొప్ప క్లిష్టసమస్య.
శౌన:—అరుగో! సుందమహారాజుగారు జంబూకసమేతులై యిటు దయచేయుచున్నారు.

ఉపసుం:—(లేచి యెదురుగాఁ బోయి) అన్నయ్యా! నమస్కారము.

సుందు:—వత్సా! చిరంజీవివి కమ్ము.

జంబు—తథాస్తు.

ఉపసుం:—అన్నయ్యా! మీ యనుగ్రహ మున్న పక్షమునఁ జిరంజీవి నగుదును.

సుంద:—నాయనుగ్రహ మెందుకు?

ఉపసుం:—

తే. అల తిలోత్తమఁ జూచిన దాదిగాఁగ
మదన బాణాగ్నిలోఁబడి క్రమ్గుచుంటి
చేడె నాకిచ్చి పెండిలి సేయుదేని
నే చిరంజీవి నగుదు లేనియెడఁ గాను. 4

జంబు:—(తనలో) ప్రభువుగారికి పచ్చివెలగకాయ గొంతుకపడ్డట్టున్నది.

శౌన:—(తనలో) కోరిక దాఁగక మాప్రభువుగారికి కక్కవలె పైకి వచ్చినది.

సుంద:—వత్సా! అసాధ్యమైన కోరిక కోరితివి.

తే. ఆనెలంతను గనుఁగొన్న దాదినేను
నమిత మోహంబనెడు ప్రవాహంబునఁ బడి
కొట్టుకొనిపోవు చున్నాఁడ గట్టు గనక
దరినిఁ జేర్చు భారము నీది తమ్ముగుణ్ణ. 5

ఉపసుం:—అన్నయ్యా! నే నొక మనవిచేసెద సావధానముగ నాక ర్ణింపుము.

మ. అనుజన్ముండ విధేయుఁడన్ మదిని నీకత్యంతమున్ గూర్తు నం
దన తుల్యుండ పడంతి నాకు నిడుమా నాముద్దుచెల్లింపుమా

సుం:— అనుజన్ముండవు నీవు జ్యేష్ఠుఁడను నే నాబాల్యమున్ నాకు నం
దనతుల్యుండవు నాకునామెనిడుమానాకోర్కిమన్నింపుమా. 6

ఉపసుం:—అన్నయ్యా! చిన్నవాని ముద్దు చెల్లింపవలదా?

సుందు:—పెద్దతికమును గౌరవింపవలదా?

ఉపసుం:—ఆమెను విడచుట నాప్రాణములు విడుచుటే.

సుందు:—దాని నీకిచ్చుట చచ్చుటే.

శౌన:—(తనలో) ఎవరో యొకరు చచ్చినఁగాని యీతగవు తీరదు.

ఉపసుం:—అన్నా! ఆమె నన్ను వలచినది.

సుందు:—నన్నే వలచినది.

ఉపసుం:—అది పొరపాటు.

సుందు:—నీది వట్టిభ్రమ.

ఉపసుం:—భ్రమ యనుట వట్టిభ్రమ.

సుందు:—నీవు సత్య మరయ లేకున్నావు.

జంబు:—(తనలో) వీరి సంభాషణ మిద్దఱి పిచ్చివాండ్ర సంభాషణము వలె నున్నది.

ఉపసుం:—నానిమిత్త మామె నిద్రాహారములుమాని విరహతాపము పడుచున్నది.

సుందు:—ఆతాపము నానిమిత్తముగాని నీనిమిత్తముగాదు. జంబుకా! నాకోఱ కామె యెట్లు పరితపించుచున్నదో నీచెవులతో నీవు వినలేదా?

జంబు:—చిత్తము. మహాప్రభూ! మీానిమిత్తము గొడ్డుమూలిగినట్లు మూలుగుచున్నది.

ఉపసుం:—శౌనకా! మన మిద్దఱము వెళ్లినపు డామె యవస్థ యెటు లున్నది?

శౌన:—మన్నెపుజ్వరము వచ్చినట్లు తెగ బాధపడుచున్నది.

ఉపసుం:—అన్నయ్యా! విన్నావా?

సుందు:—జంబుకుని పలుకు లాలకించితివా?

జంబు:—అది యేదో నాటకమాడి మిమ్ములనిద్దఱను భ్రమ పెట్టినది.

సుందు:—పశువా! నోరుమూసుకో.

ఉపసుందు:—ఓరిగాడిదా! ప్రేలకు.

సుందు:—తమ్ముఁడా! దాని నేనెట్లు విడుతును?

తే. సఖియ కనులు శృంగార రసంపు గనులు

ఉపసుం:— ముదితమాటలు ముద్దులమూట లరయ

సుందు:— నల్లచీమలబారు సూ నాతియారు

ఉపసుం:— చాన కెమ్మోవి యమృత రసంపు బావి. 7

శౌన:—(తనలో) ఆబావిలోఁబడి యిద్దఱు చావవలసినదే.

సుందు:—అట్టియెడ దాని నెట్లు విడుతును?

ఉపసుం:—నేనెట్లు విడచి బ్రతుకఁగలను?

ఉ. ఆయెలనవ్వు వెన్నెలలయందలి చల్లదనంపు టేటిలో

హాయిగ స్నానమాడి సుఖమందఁగ నువ్విళు లూరుచుంటి నే,

సుందు:— కాయజు పూవుటమ్ములచు గాయములయ్యెను నాదుమేన నా

గాయముమాన్ప దాని బిగికౌఁగిలియే యమృతంపు లేపమా. 8

ఉపసుం:—అన్నయ్యా! కామదేవుఁడు నిర్దయుఁడు. పువ్వుటమ్ములను నిప్పులు చల్లుచున్నాఁడు. ఆతాపమునకు నేను తాళఁజాల. అందుచేత నాకు మరణముతప్పదు. కాముఁడను వేఁటకానిచేఁ జచ్చుటకంటె నీచేత మేనుదొఱఁగుట మంచిది. ఇదిగో! యీ ఖడ్గము పూని నాశిరస్సు ఖండించి నాకు సుఖ మొడఁగూర్చి నీవా తిలోత్తమతో సుఖింపుము.

(అని ఖడ్గ మీయఁ బోవుచున్నాఁడు)

శౌన:—అయ్యో! అయ్యో! వద్దు వద్దు.

సుందు:—తమ్ముఁడా! అంతిపాపము చేయఁజాల. నీకంత సాహసము వలదు. నీసుఖము నిమిత్తమై నేనే ప్రాణముల విడిచెద. నా శిరస్సు కామదేవునకు కానికగ నిచ్చెదను.

(అని కత్తి మెడమీఁదఁ బెట్టుకొనుచున్నాఁడు)

జంబు:—అయ్యో! మహారాజా! వద్దు వద్దు.

ఉపసుం:—(తొందరగా లేచి కత్తిపట్టుకొని) అన్నయ్యా! అమానుష కృత్యము వలదు. ఆత్మహత్య కూడదు.

శౌన:—ఎవడో యొకడు పోయిన నీతగవు తీరును.

సుందు:—వత్సా! ఆమెమీఁది వలపును నేను నివారింపలేకున్నాను.

ఉపసుం:—నేను నట్లే యున్నాను.

జంబు:—రోలుపోయి మద్దెలతో మొఱ పెట్టుకొన్నట్లున్నది.

సుందు:—వత్సా! మన వివాద మొక విధముగా పరిష్కారమగును.

ఉపసుం:—అది యెట్లో సెలవిమ్ము.

సుందు:—తిలోత్తమను మన మిరువురముకూడ వివాహ మాడుదము.

ఉపసుం:—అది జనవిరుద్ధముగాదా?

సుందు:—ఒరులేమనుకొన్నను మనకేమి? మనయెదుట మనలనిందింపఁ జాలరు కదా?

ఉపసుం:—దానివలన మాత్రము బాధలు కలుగవా?

జంబు:—"షడ్డకో షడ్డక శ్చైవ ముష్టియుద్ధం పునఃపునః"

సుందు:—ఓరి కోతికుంక! నోరుమూసుకొనరా.

శౌన:—(తనలో) కాముకులకు సిగ్గులు నెగ్గులు నుండవు.

ఉపసుం:—అట్లైన ముందుగా నెవరు దానిని జేపట్టవలెను?

సుందు:—జ్యేష్ఠుఁడను కాఁబట్టి నేను చేపట్టవలెను.

ఉపసుం:—కనిష్ఠుఁ డను గావున నాగారము చెల్లవలెను.

సుందు:—తమ్ముఁడా! ఇందులోనైన నామాట చెల్లకూడదా?

ఉపసుం:—ఈచిన్నవిషయములోనైన తమ్మునిముద్దు జరుగఁగూడదా?

జంబు:—(తనలో) ఈముద్దులు చివరకు గుద్దులుగా మాఱును.

శౌన:—(తనలో)దానినికోసి చెఱియొకముక్క పంచుకొనినబాగుండును.

సుందు:—"పితృసమో జ్యేష్ఠః" అని పెద్దలు చెప్పుదురు.

ఉపసుం:—"పుత్రసమఃకనిష్ఠః" అని యాపెద్దలే వచించినారు.

సుందు:—అన్నగారిని ధిక్కరించుట మహాపాతకము.

ఉపసుం:—తమ్ముని వంచించుట ధర్మవిరుద్ధము.

సుందు:—మన వాదమువలన నీసమస్య తీరదు.

ఉపసుం:—అట్లైన నిర్వివాదముగా నీవిషయము పరిష్కరింపుము.

సుందు:—అట్లైన మన మిరువురము పోయి తిలోత్తమనుజూచి యామె యెవరిని వలచినదో చెప్పుమని కోరుదము. ఆమె నిన్ను వలచిన నీవు చేకొనుము. నన్ను వలచిన నేను చేకొందును.

జాబు:—పిట్ట పిట్ట పోరు పిల్లి తీర్చినట్లున్నది.

శౌన:—ఆ మాయలమారియే యీతగవు తీర్పఁగలదు.

ఉపసుం:—అట్లైన నా మొకడకే పోవుదము రమ్ము.

సుందు:—జాబుకా! తిలోత్తమ యున్నకడకు దారి చూపుము.

జంబు:—చిత్తము. దయసేయుఁడు.

---

## మూఁడవ రంగము

[ జంబుకుఁడు, శౌనకుఁడు ప్రవేశించుచున్నారు ]

జాబు:—ఓరీ శౌనకా! దేవతలు టక్కరిముండకొడుకులు. సుందోపసుందులమీఁదికి మహామారిని బంపినారు. వీరికి వినాశకాలము వచ్చినది.

శౌన:—అది మిక్కిలి యందముగా నుండుటచే వీరికి మొదలు తెలియక పిచ్చెత్తినది.

జంబు:—అందమైనది గనుకనే వీరిపాలిటి ప్రాఁచుపామైనది.

శౌన:—దానియందము మెచ్చవలసినదేరా! దానికనులాల్చిప్పలురా!

జంబు:—నిజమే. దాని ముక్కు మన శుక్రాచార్యులవారి పోడుము కాయ వలె నున్నది.

శౌన:—దానిని జూడఁగా మనకుకూడ కవిత్వము పుట్టుచున్నదిరా! దాని క్రిందిపెదవి ఖంరెపకాయ!

జంబు:—దాని నోరు దొన్నె!

శౌన:—దానిచెక్కిలి మంగలికత్తి నూరురాయిలాగ నున్నగానున్నది!

జంబు:—దానితల తాటిపండురా! వెనుకనలుపు! ముందెఱుపు!

శౌన:—దానిచెవులు వడియములురా!

జంబు:—కొంపదీసి కోతికి కరకర నమలెదవేమో!

శౌన:—అగును. కోతికి నములవలెనని బుద్ధిపుట్టుచున్నది.

జంబు:—పుచ్చుకుక్కలాగ నున్న నీకుఁగూడ శృంగారమా!

శౌన:—నేను పుచ్చుకుక్క నైన నీవు యొండునక్క వు.

జంబు:—ఓరి దొంగతొత్తుకొడకా! నేను నక్కనటరా?

శౌన:—ఓరిమొండిముండకొడకా! నేను కుక్కనటరా?

జంబు:—సుందమహారాజుగారి బంటును నీవధిక్షేపించెదవా?

శౌన:—ఉపసుందమహారాజుగారి సేవకుఁడను నన్ను నీవు నిందించెదవా? ఇదిగో కాసుకో నాదెబ్బ. ఒకగ్రుద్దు గ్రుద్దితినా నెత్తురు గ్రక్కుకొని చచ్చెదవు. (గ్రుద్దఁబోవుచున్నాఁడు)

జంబు:—(శౌనకుని పట్టుకొని గొంతు పిసికి) చచ్చినావురా ముండకొడుకా!

శౌన:—(గోంగ్రడించుచు జంబుకుని చేయి కఱచుచున్నాఁడు)

జంబు:—(గొంతు విడిచి) నీవు శౌనకుఁడ వనుమాట సార్థకమైనదిరా! కాట్లకుక్కవలె కఱచినావు! కుక్కకాటునకు చెప్పుదెబ్బ అన్నారు. (చెప్పుతో కొట్టుచున్నాఁడు)

శౌన:—ఈ నక్కజిత్తులు నాదగ్గఱ పనికిరావు. ఇదో కత్తితెచ్చి నీతల తెగవేసెదను. ఉండు.

జంబు:—నేనుకూడ మాయింటికిఁబోయి ఖడ్గముతెచ్చి యీపాపాత్ముని మట్టుపెట్టెదను.వీనిపొగరుమీఱుచున్నది.(ఇద్దఱునిష్క్రమింతురు)

---

## నాలుగవ రంగము

[ తిలోత్తమయు, మంజుఘోషయు ప్రవేశించుచున్నారు ]

తిలో:—ఓసి మంజుఘోషా! నీ వన్నట్లు మన కార్యసిద్ధి కావలసిన దినము నేఁడే.

మంజు:—భగవానుఁడగు భాస్కరుఁడు సకలభూత చైతన్య ప్రదాతయై తూర్పుకొండ నలంకరించుచున్నాఁడు. ఈయన యస్తమించు లోపల మన సంకల్పము ఫలించును.

తిలో:—ఇంతకు దానవసోదరు లెట్లున్నారు?

మంజు:—ఎట్లున్నారని చెప్పుకుందు ఈనినపంపులవలె నెవరిని దగ్గఱకు రానీక సేవకులపై సయితము కస్సు బుస్సు మని కొట్టబోవుచు నానావస్థలఁ బడుచున్నారు. వారి మన్మథవ్యధకు మితిలేక యున్నది.

తిలో:—ఇద్దఱకు తలవెట్టియె త్తినదిగదా! అందుచేత వైరముతప్పదు.

మంజు:—వైరము తప్పనప్పుడు మరణము తప్పదు.

తిలో:—దేవతల సంకల్పముచేత నిదిజరుగుఁగాక. కాని యన్నదమ్ములు సంధి చేసుకొందురేమో!

మంజు:—మదనజ్వరముచేత వారికి సంధిరోగముపుట్టినది. 'తిలోత్తమ' 'తిలోత్తమ' యని పలవరించుచున్నారు. ఆసంధి తప్ప వేరు సంధిలేదు. ఈ సంధిరోగము వారి ప్రాణములు తీయునదే.

తిలో:— తే. ఆసవముకన్న ప్రబల మద్యంబుకన్న
కల్లుకన్న మైరేయంబుకన్నఁ గూడ
నధిక మదము గల్గించు మోహంబు నరున
కాత్మపతనికి కారణ మగును దుదకు.

మంజు:—ఏపిశాచమునకైన మంత్ర మున్నది కాని కామ పిశాచము నకు మంత్రసాధనము లేదు.

తిలో:—అడుగులచప్పుడగుచున్నది. ఎవరో వచ్చుచున్నారు చూడు.

మంజు:—(పరికించి చూచి) అదుగో! సుందోపసుందులే నీదర్శనార్థమై వచ్చుచున్నారు.

[ సుందోపసుందులు ప్రవేశింతురు ]

తిలో:—వీరిపాలిటి కాళరాత్రిని నేనని యెఱుఁగక మృత్యుముఖమును జొచ్చినట్లు వీరు నాకడకు వచ్చుచున్నారు.

మంజు:—మన మాడదలఁచిన నాటకములో కడపటి యంక మిది.

తిలో:—(ఎదురుగాఁ బోయి) దానవసార్వభౌములకు స్వాగతము.

సుందు:—కల్యాణీ! మంగళము.

ఉపసుం:—కల్యాణము.

మంజు:—కల్యాణకాలమునకే యీమె యెదురుచూచుచున్నది.

సుందు:—అచిరకాలములోనే నది ప్రాప్తించును

ఉపసుం:—అది నేఁడే కావచ్చును.

తిలో:—మహాత్ములారా! పాదచారులై మీరు శ్రమపడి నాకడకు రానేల. మీకడకు రమ్మని కాకిచేత వార్తంపిన నేనురానా?

సుందు:—నీవు విరహతాపముచేత నస్వస్థురాలవైనందున మేమే వచ్చితిమి.

మంజు:—ఆవిరహము మీనిమిత్తమే కాదా?

తిలో:—దేవరవారిని రప్పించిన పని యేమో సెల వీయవలెను.

సుందు:—కల్యాణి! నేను నీమీఁద వలపు నిలిపితిని.

ఉపసుం:—నేనును నిన్నుగుఱించి మోహాంబుధిలో మునిఁగితిని.

సుందు:—అక్కతమున మా కహోరాత్రములు నిద్రాహారములు లేవు. అందుచేత మాలో నీవెవ్వని వరింతువో విస్పష్టముగాఁజెప్పుము.

నీముఖంబున నాపలుకులు విని రెండవనాఁడు తపోవనమునకు [illegible] నరుగును. ప్రాణములైన విడచును.

మంజు:—(తనలో) ఆతమాట పుట్టవలెనుగదా!

తిలో:—మహాత్ములారా! నన్ను సంకటావస్థలోఁ బెట్టితిరిగదా!

సుంద:—సుందరీ! నీవు భయపడకు. నీయిచ్చవచ్చినవానిని నిస్సంకోచముగా వరింపుము. కాని యొక్కమాట. విను—

తే. పంచబాణ మార్తాండ తాపంబుచేత
నవసియున్నది నామేను వివశమగుచు
మెలఁత నీనీడ యనియెడు నీడలోన
దాఁగి ప్రాణంబు గాచికో దలఁచుకొంటి. 10

ఉపసుం:—కల్యాణి! నామనవికూడ విను—

తే. కాముఁ డనియెడు బలు వేఁటకాఁడు నన్ను
గనికరములేక వధియింపఁగాఁ దలంచె
తెఱవ నీభుజమధ్య మందిరమునందు
నన్నుఁ దలఁదాఁచుకొననిమ్ము మిన్నకుండ. 11

తిలో:—అయ్యయ్యో! మీవంటి మహాభాగులకు [illegible] చేయుటకు నేనెంతదానను?

సుంద:—ఎంత దాన వననేల? ఎంతదానవు గాకున్న [illegible] యెత్తును?

ఉపసుం:—నీవెంతదానవైన నగుదువు!

సుంద:—త్రిలోకసుందరీ! ఇది [illegible]. ఈ సమయమున నీకర్తవ్య మిది.

ఆ. చక్కఁదనము చూడు సౌకుమార్యము చూడు

ఉపసుం:— సాహసంబు చూడు శక్తి చూడు

సుంద:— బాహుయుగము చూడు దేహదార్ఢ్యము చూడు

ఉపసుం:— మాట చూడు మొగము తీరు చూడు 12

సుందు:— తే. నీవు నాబహిఃప్రాణంబు నీరజాక్షి
ఉపసుం:— నీవు నాభాగ్యరాసివి నెలఁతమిన్న
సుందు:— నీవు నాతపఃఫలమవు నిశ్చయముగ
ఉపసుం:— నాకనుల చందమామవు నలినవదన. 13

సుందు:—ప్రేయసీ! మా పరస్పర తారతమ్యములు నీ విదివఱకే యెఱుంగుదువు కాని నావిషయమై యించుక చెప్పెదను విను.

ఉపసుం:—నేనును జెప్పెదను. ఆకర్ణింపుము.

సుందు:— తే. మానసీయ మహాతపో మహిమవాఁడ
ఉపసుం:— పద్మసంభవ వర్ణిత ప్రతిభవాఁడ
సుందు:— భువన వందిత నిత్యవైభవమువాఁడ
ఉపసుం:— అష్టదిక్పాల భయద సాహసమువాఁడ 14
సుందు:— గీ. కరగతానేక శస్త్రాస్త్ర గరిమవాఁడ
ఉపసుం:— అమర నిర్జేయ బాహు విక్రమమువాఁడ
సుందు:— జయరమా పీఠ విపుల వక్షంబువాఁడ
ఉపసుం:— కల్పశాఖాభ బాహు యుగ్మంబువాఁడ 15
సుందు:— సాధు సజ్జనకోటి రక్షణమువాఁడ
ఉపసుం:— శత్రుసైనికానీక శిక్షణమువాఁడ
సుందు:— సకలజనమాన్య చండశాసనమువాఁడ
ఉపసుం:— అమరపూజిత పాదపద్మములవాఁడ 16
సుందు:— కామినీ మనోహర గుణగణమువాఁడ
ఉపసుం:— అంగనాప్రియ చతుర వాక్యములవాఁడ
సుందు:— ప్రాణసఖి! నీకు నచ్చిన యట్టివాఁడ
ఉపసుం:— నేను నీవాఁడ నేలుకో నెనరుతోడ. 17

సుందు:—ప్రియురాలా!

తే. తావకముఖేందు మండల దర్శనమున
పొంగి పొరలు చున్నది నాదు మోహవార్ధి
కోర్కెలను తరగలు లేచి కొట్లకొలఁది
పోటుమీఁద నున్నది కాని పాఱుటుఁగదు. 18

ఉపసుం:—ప్రాణేశ్వరి!

తే. నీకు వదనాంబుజాతంబుమీఁద నిపుడు
నామనస్సంచరీకంబు ప్రేమతోడ
వ్రాలియున్నది మరలింప వశముగాదు
మొలకలెత్తె కోర్కెలు మేను పులకలెత్తె. 19

సుంద:—కాంతామణీ! నన్ను నీవు వరింతువేని త్రైలోక్య సామ్రాజ్యంబునకు నిన్ను పట్టమహిషిని జేతును.

ఉపసుం:—నన్నుఁ జేపట్టుకువేని ముల్లోకములు నీకనుసన్నల మెలంగునట్లు చేసెదను.

సుందు:—ఇంద్రాణిచేత నీయి ల్లూడ్పించెదను.

ఉపసుం:—కమలభవుని రాణిచే నీకాళ్లు పట్టించెదను.

సుందు:—శ్రీమహాలక్ష్మిని నీకు సేవకురాలిని జేసెదను.

ఉపసుం:—పార్వతిచేత నీయింటి పాఁచిపని చేయించెదను

సుందు:—పారిజాతవృక్షము నీపెరటిచెట్టుగాఁ జేసెదను.

ఉపసుం:—మందారతరువు నీమందిరోద్యానమున నాటెదను.

సుందు:—కామధేనువు నీగాఁడిపసరమగును.

ఉపసుం:—చింతామణి నీముంజేతికంకణమున నతికించెదను.

సుందు:—దేవేంద్రుఁడు నీద్వారపాలకుఁ డగును.

ఉపసుం:—దండధరుఁడు నీపసులకాపరి యగును

సుందు:—బ్రహ్మ నీయింట పంచాంగబ్రాహ్మణుఁ డగును.

ఉపసుం:—వాయుదేవుఁడు నీకు వీవన విసరును.

సుందు:—నీకుఁ గలుగు సౌఖ్యము లింకెవరికిఁ గలుగవు.

ఉపసుం:—దేవతాంగనలు నీ వైభవముచూచి యాశ్చర్యము కలిగి యుందురు.

సుందు:—నీకన్న గొప్పది ముల్లోకముల నుండదు.

ఉపసుం:—అప్సరలు నీకు తలయంటి స్నానము చేయించెదరు.

సుందు:—కల్యాణి! ఇవియెల్ల లోఁదలఁచుకొని స్వయంవరము చేసుకొనుము.

ఉపసుం:—అనాలోచితముగా వర్తింపకుము.

సుందు:—

ఉ. హారము లొల్లకుంటిని, విహారము లొల్లక యున్నవాఁడ నా
హారము మానుకొంటి వ్యవహారము పొంతకుఁ బోవకుంటి సూ
దారలఁ జూడనైతి నతిదారుణవేదన లొందుచుంటి నా
కారము చూడు మెంతటి వికారము నొందెనో మేనుసన్ననై. 20

మంజు:—(తిలోత్తమ చెవిలో) అన్నదమ్ము లొకరిని మించి యొకరు కోఁతలు కోయుచున్నారు.

తిలో:—(రహస్యముగా) చేతలకు కోఁతలకు చాలదూరము. (ప్రకాశముగా) దానవేశ్వరులారా! ఈ విషయమున నేను యిదమిద్ధమని నిర్ణయింపఁజాలకున్నాను. ఏమన—

తే. ఒకటి సంపంగిపువ్వు, వేరొకటి జాజి
యొకటి బంగారుఘుటిక, వేరొక్కటి మణి
యొకటి కైలాసశైల మింకొకటి మేరు
వేది గ్రహియించి వీనిలో నేది విడుతు? 21

మఱియును—

సీ. ఔత్సుక్యమునయందు నౌదార్యమునయందు
నిరువురు తుల్యులే యెంచిచూడ

సమరదోహలమందు సాహసంబులయందు
నిరువురు తుల్యులే యెంచిచూడ
కార్యదీక్షలయందు గాంభీర్యమునయందు
నిరువురు తుల్యులే యెంచిచూడ
నుగ్రతపోనిష్ఠ నిజ్వల మహిమల
నిరువురు తుల్యులే యెంచిచూడ

ఆ. శత్రు శిక్షణమున మిత్ర రక్షణమున
నిరువురును సమాను లె చిచూడ
నెవరి నేవరింతు నెవ్వని త్యజియింతు
నేమిసేతు నిప్పు డేమిబుద్ధి. 22

సుం:—కల్యాణి! నవనీతమువంటి నీమనస్సు వ్యాకులముచేత మలినము చేయకుము.

ఉపసుం:—నిర్భయముగా నీయిచ్చవచ్చినట్లు చేయుము.

సుంద:—(తనలో) ఈమె తప్పక నన్నే వరించును.

ఉపసుం:—(తనలో) ఈమె కటాక్షము నామీఁదనే పడును.

తిలో:—అసురనాయకులారా! కాంతల చక్కఁదనముకూడ సామ్రాజ్యము వంటిది. సామ్రాజ్యములను బాహుబల సంపన్నులగు మహావీరులే యనుభవింతురుగదా. అట్లే సౌందర్యముకూడ వీరభోజ్యము. కావున మీ యిరువురిలో నెవ్వఁడు మహావీరుఁడో యాతనినే వరించెద. మీరుభయులు ద్వంద్వయుద్ధము చేయుఁడు. ఎవ్వఁడు గెలుచునో వాని కంఠము నలంకరించుటకు హస్తమున మందారమాల పూనియుంటిని. విజయలక్ష్మితోపాటు నన్నుగూడ నతఁడే చేకొనుఁగాక!

సుంద:—భళీ! కల్యాణి! మేలైనమాట పలికితివి. నాభుజవిక్రమము నీవే చూచెదవుగాక!

ఉపసుం:—శ్లాఘ్యమైన పథము త్రొక్కితివి. నావిక్రమము నీకను పండువు సేయుఁగాక!

తిలో:—మహాత్ములారా! మీలో గెలుపొందినవారు రెండవవానిని వధింపఁగూడదు. ఆహింస నేఁజూడఁజాల.

సుందు:—ఒకఁడు మరణించినఁగాని రెండవవాఁడు గెలుపొందఁడు.

ఉపసుం:—విజయమేకాని మరణముజోలి నీకెందుకు?

సుందు:—క్షణకాలములో విజయమునొంది నిన్నుఁగౌఁగిలించెద.

ఉపసుం:—ఆమెనుగాదు. మృతినొంది రంభను కౌఁగిలింతువుగాని.

సుందు:—ఆమె పుష్పమాల నీమెడయందుంచుఁబడదు. మరణోన్ముఖుఁడవైన నీకంఠమున వేయుటకు మందారమాలలు ధరించి యప్సరలెదురుచూచుచున్నారు.

ఉపసుం:—అవి నాకొఱకుఁ గావు నీకొఱకేమో!

సుందు:—జయము పొందెడువానికి యప్సరల పొందేల?

ఉపసుం:—జయము నీకే కల్గునని యెట్లు చెప్పఁగలవు? యుద్ధములు జూదములవంటివి. జయాపజయములు దైవాయత్తములు.

సుందు:—నాబాహుబలమే నాకు జయ మిచ్చును

ఉపసుం:—నీవెంత? నీబాహుబలమెంత?

సుందు:—ఓరీ భ్రాతృద్రోహీ! నేనెంత? నాబాహుబలమెంత? పిచ్చుకను నలిపివేసినట్లు నలిపివేసెదను. జాగ్రత్త!

ఉపసుం:—ఓరీ! గర్వోన్మత్తా! భ్రాతృద్రోహిని నేనుగాను నీవే.

తిలో:—(మంజుఘోషతో) ఓసీ! క్రోధాగ్ని రగులుచున్నది. ఇఁక జ్వాలలు లేచును.

మంజు:—ఆజ్వాలలకు వీ రాహుతి యగుదురు.

సుందు:—ఇదిగో క్షణకాలములో యమమందిరమున కతిథిఁగాఁబంపెద.

ఉపసుం:—మొదటి యతిథివి నీవే యగుదువు.

సుంద:—నాగదకు నీవు ప్రథమకబళంబ వగుదువు.

ఉపసుం:—నాఖడ్గమునకు నీవెర వగుదువు, కాదు. కాదు. నాగదా పాతమే నీశిరంబు వ్రక్కలు చేయును.

సుంద:—పలుకులు కోటలుదాటును. పనులుమనస్సులోనేయుండును.

ఉపసుం:—మాటలుగావు ఇవిగో పోటులు. కాసుకో.

(అని గద యెత్తుచున్నాడు)

సుంద:—ఆగద నెత్తిన హస్తమే ముందు విఱుగకొట్టెదను.

తిలో:—మహావీరులారా! అన్యోన్యసంహారదీక్షితులయిన మీయిరువురసంరంభము భయంకరముగా నున్నది. అబలలమైన మేము దుర్వారసంగ్రామము చూడలేము. మీరా బయలిమీఁదికి వెడలి యుద్ధము సేయుఁడు.

సుంద:—అగును. నిజమే.

ఉపసుం:—అట్లే యగుఁగాక. (అని యిరువురు నిష్క్రమించుచున్నారు)

తిలో:—ఈపోవుట యమలోకమునకే.

మంజు:—వారి హుంకారములు యమవాహనము మెడలోని ఘంట చప్పుడువలె వినఁబడుచున్నది.

తిలో:—సఖి! చూడు చూడు. పందెములు కట్టిన కోడిపుంజులవలె సోదర స్నేహము వదలి యీరాక్షసు లొకరిమీఁద నొకరు ఖడ్గములు పుచ్చుకొని దుముకుచున్నారు.

మంజు:—ఆఁబోతులవలె వీరు పోరాడుచున్నారు.

తిలో:—ఓసి! చూడు చూడు! సుందుఁడు ఖడ్గముతో తమ్ముని బాహువు మీఁద కొట్టఁగా వసంతమువలె నెత్తురు కారుచున్నది.

మంజు:—ఔనౌను. పాప ముపసుందుఁడు తన ఖడ్గముతో సుందుని గుండెలలో పొడిచినాఁడు. కొండనుండి సెలయేరు పాఱినట్లు వాని శరీరమునుండి నెత్తు రెట్లు ప్రవహించుచున్నదో!

తిలో:—ఓసి! చూడు చూడు. సుందుఁడు మూర్ఛపోయినాఁడు.

మంజు:—మూర్ఛపోయినను వెంటనే లేచి మరల నుపసుందుని మీఁదికిఁ బోవుచున్నాఁడు.

తిలో:—అయ్యో! ఈసారి ఉపసుందుఁడు మూర్ఛపోయినాఁడు.

మంజు:—పడిననేమి. బంతిలాగున లేచి సుందునిమీఁదికిఁ బోవుచున్నాఁడు.

తిలో:—చూడు. ఈసారి కన్నులు చింతనిప్పులవలె నెఱ్ఱగాఁ గనఁబడఁగ పండ్లు పటపటఁ గొఱుకుచు “రారా! రారా! ఈదెబ్బతో సరి సరి” యనుచు గదల చేతఁబట్టుకొని నొకరి నొకరు డీకొనుచున్నారు.

మంజు:—నెత్తురు చాల కారిపోవుటచే చాల నీరసముగా నున్నారు.

తిలో:—అయ్యో! అయ్యో! పాపము. అన్యోన్య గదాఘాతముచేత నేనుఁగులవంటి వీరు పీనుఁగులై నేలఁ గూలినారు. దుర్మార్గులైనను నాకతమున వీరు కూలుటచే నాకు మిక్కిలి జాలి కలుగుచున్నది.

(తెరలో—హా సుందమహారాజా!
హా ఉపసుందమహారాజా!)

మంజు:—వీరి యనుచరులైన జంబుక శౌనకులు ప్రభువుల మరణము నకై విలపించుచున్నారు.

తిలో:—దుర్వ్యసనాసక్తులైన వారి గతి యింతేగదా!

( తెరలో—భళీ! భళీ! తిలోత్తమా! భళీ! తిలోత్తమా! )

[ పుష్పవర్షము కురియుచున్నది ]

మంజు:—సఖి! దేవతలు నిన్ను శ్లాఘించి పుష్పవర్షము గురిపించుచున్నారు.

తిలో:—ఇదియెల్ల నసురుల సంకల్పమే. నాప్రజ్ఞ కాదు. ఇఁకమీఁద సిద్ధ సాధ్య గంధర్వ విద్యాధర ప్రముఖులు సుఖముగా బ్రదుక వచ్చును.

[ అపుడు విమానముమీఁదనుండి జయకేతుఁ డను
విద్యాధరుఁడు ప్రవేశించుచున్నాఁడు ]

జయకేతుఁడు:—కల్యాణి! తిలోత్తమ! జయము. జయము.

తిలో:—అయ్యా! మీ రెవరు?

జయ:—సుందరి! నేను జయకేతుఁ డను విద్యాధరుఁడను. త్రిలోకాధిపతి యైన మహేంద్రుఁడు నిన్ను బహూకరించి తోడ్కొని రమ్మని తన విమాన మిచ్చి నన్ను బంపెను. అదిగో సువర్ణమయమై బహురత్నఖచితమై దేదీప్యప్రభాభాసమానమై రత్న కింకిణీ సహస్ర నినాద మనోహరమై మందార పారిజాత పుష్ప మాలాలంకృతమై వెలయుచున్న విమానము.

తిలో:—ఇంత గౌరవమునకు నేనర్హురాలనుగాను.

మంజు:—ప్రభువుల యనుగ్రహమునకుఁ బాత్రమవైతివి.

జయ:—సుందరి!

తే. కాలదండంబు విష్ణుచక్రంబుఁ జేయ
లేని పని నెఱవేర్చెను లేమ యొకతె
దైవ మనుకూల మగు నేని తప్పకుండ
నెంతటి యసాధ్యమైన సిద్ధించు శ్రేగ. 23

తిలో:—దేవతానుగ్రహ మున్నపక్షమున గడ్డిపరకయు మహాశస్త్ర మగును. ఇందు నాప్రజ్ఞ లేదు. భగవానుఁడగు కామదేవునిదే ప్రజ్ఞ. నేను నిమిత్తకారణము.

మంజు:—నీవు కామదేవునకు కామదేవుఁడు నీకు తోడగుటచేత కార్య సిద్ధి యైనది.

జయ:—కల్యాణి! నిజమే. తగిన శస్త్రము లేనపుడు వీరుఁ డేమి చేయఁగలఁడు.

తే. పడఁతి నీసురూపంబు చాపంబుచేసి
నవ్య లావణ్యమును మేటి నారిచేసి
తొడరి నీచూపు క్రొవ్వాఁడి తూపుచేసి
కూల్చినాఁడు దానవులను కుసుమశరుఁడు. 24

మంజు:—సఖి! దేవతలు విజయలక్ష్మిని వలె నిన్ను వేయికన్నులతోఁ జూచి యానందింప మహేంద్రుఁడు కోరుచుండును. రమ్మి. వేగము పోవుదము.

జయ:—పదునాల్గు జగములు సుఖించుఁగాక!

చ. వ్యసనములం దగుల్కొనక యన్యులయర్థము గోరకుండ మా
నసమున నిండుభక్తిని జనార్దను పాదములన్ భజించుచున్
వసతులు పాఁడిపంటలును భాగ్యము బిడ్డలుగల్గి యింక తా
రసదృశ సౌఖ్యలీల శతహాయనముల్ బ్రదుకన్ వలెన్ బ్రజల్. 24

(అందఱు నిష్క్రమింతురు)

ఇది
పంచమాంకము
సంపూర్ణము.

———

# ఆంధ్ర నాటకములు

చిత్రనళీయము 1
విషాద సారంగధర 1
పాదుకాపట్టాభిషేకము 1
సావిత్రీ చిత్రాశ్వము 1
ముక్తావళి 1
ప్రహ్లాద 1
రామదాసు 1
రామకబీరు 1
సుభద్రార్జునీయము 1
అస్పృశ్య విజయము (ప్రేమచంద్రయోగి) 1
భక్తతుకారామ్ 1
కృష్ణలీల 1
లవకుశ 1
భక్తకుచేల 1
మేవాడు శౌర్యాగ్ని 1
విభీషణ పట్టాభిషేకము (లంకాదహనము) 1
ద్రౌపదీ వస్త్రాపహరణము 1
రామరావణ యుద్ధము 1
సతీతులసి (జలంధర) 1
గయోపాఖ్యానము 1
పారిజాతాపహరణము 1
చతురచంద్రహాస 1
శ్రీకృష్ణ తులాభారము 1
మార్కండేయ (శివలీల) 1
చింతామణి 1

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి